# ఆముఖం

మా చిరంజీవిహృదయం అతిసుకుమారం, అతి విశాలం. లోకంలో ఏ అన్యాయం జరిగినా, చిరంజీవి హృదయం బాధపడుతుంది. తాడిత పీడిత పతిత జీవుల దుర్భరస్థితికి చిరంజీవి గుండె కరిగిపోతుంది, ఉడికి పోతుంది. అందులోనూ స్త్రీలకీ, చిన్నపిల్లలకీ జరిగే అన్యాయాలను చిరంజీవి అసలే సహించలేడు. లోకంలోని అన్యాయాలు, బాధలు ప్రేరణశక్తి కాగా కరిగిన ఉడికిన హృదయంలోంచి పాటో, పదమో, కథో, నాటికో నిర్ఝరీ వేగంతో అవతరిస్తుంది. అందుచేతనే చిరంజీవి రచనలలో తాడిత పీడిత పతిత జీవుల గాథలకే ప్రాధాన్యం హెచ్చు. అడుగడుగునా ఆ కరిగిన హృదయం, ఆ ఉడికిన హృదయం మనకి గోచరిస్తుంది.

అలా కరిగిన, ఉడికిన హృదయంలోంచి ఆవిర్భవించిన అయిదు నాటికల సంపుటి ఇది.

ఇందులో స్త్రీ, నాకాభంగం అనే నాటికలు సంఘం పేరిట, పరువు మర్యాదల పేరిట తలిదండ్రులు కన్యల జీవితాలతో చెలగాటమాడి నాతి జీవితాలను ఎలా భగ్నం చేస్తున్నారో ద్యోతకం చేస్తాయి. అంతేకాదు సంస్కరణాలు, సంస్కరణాలని డాబులుకొట్టి సమయం వచ్చేవరకు దానికి భయపడి దిగజారే కుహనా సంస్కర్తలు వీటిలో గోచరిస్తారు.

ఇక 'పునరాగమనం' అనే నాటికలో పతిత జనోద్ధరణకు కంకణం కట్టిన వ్యక్తి ఎదుర్కొనవలసిన సమస్యలు, పతిత స్త్రీ మనోభావాలు ఆమె మేధాస్థాయి, దానివల్ల వచ్చే పరిణామాలు, చుట్టూచేరిన కుహనా సంస్కర్తల చర్యలు చక్కగా వ్యక్తం చేశాడు చిరంజీవి.

'అద్దంతిరిగింది' అనేది హాస్యనాటిక. ఇందులోని పాత్రలు ఆంధ్ర సాహితీ లోకంలో పేరు ప్రతిష్టలు పొంది పాఠక హృదయాలకు

హత్తుకుపోయినవే. ఈ పాత్రలన్నిటినీ ఒకచోట చేర్చి వారి వా శీలాలను ద్యోతకం చేస్తూ చక్కని హాస్య నాటిక అవతరింప జేశా చిరంజీవి. కాని ఈ నాటికకూ తక్కిన వాటికీ అంతగా లయ కుదరడంలేదు. దీనిని వేరే సంపుటిలో ముద్రిస్తే బాగుండేదేమో ననిపిస్తుంది.

ఆఖరినాటిక 'బడిపంతులు'. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన మహా మేధావులు కూడా ఒకనాడు బడిపంతులు దగ్గిర 'ఓనమాలు' దిద్దినవారే. వారి లేతమనసులలో సరియయిన బీజాలను నాటి వారి భావిజీవితానికి రూపు రేఖలు ఏర్పరిచే బడిపంతులు తన పిల్లలకు మందిప్పించుకోడానికి కూడా డబ్బులేక ఎలా నికృష్టజీవితం అనుభవిస్తున్నదీ, గ్రామకక్షలలో, ఎలక్షన్లలో తలదూర్చ నిరాకరించే బడిపంతుళ్ళమీద ఎట్టి అభాండాలు వేసైనాసరే, యెంత నీచానికి పాల్పడైనా లొంగదీయాలని చూచే 'గ్రామ పెద్దలు' ఇందులో సాక్షాత్కరిస్తారు.

ఈ రచనలన్నిటిలో చిరంజీవి కరుణార్ద్ర హృదయం, లోకం పోకడకు అతను పడే బాధా, పతితలకు అనుభూతికి వస్తాయి. సంభాషణలు ఎక్కడా అడ్డకుండా సహజంగా చకచకా సాగిపోతాయి. పాత్ర చిత్రణలో, సంఘటనా చిత్రణలో చక్కటి శిల్పం గోచరిస్తుంది. స్త్రీ, పునరాగమనం అనే నాటికలలో చిరంజీవి సినిమా టెక్నిక్ ను ఉపయోగించి నూత్న పంథాలో నడిపించారు.

ఈ అయిదు నాటికల సంపుటినీ చిరంజీవి సుప్రసిద్ధ నాటక నాటిక రచయిత శ్రీ ఆచార్య ఆత్రేయకి అంకితమిచ్చారు. ఇంత చక్కటి నాటికలను అంకితం పొందిన ఆత్రేయ అదృష్టవంతుడో, తన కావ్యకన్యను అటువంటి సుప్రసిద్ధ కళాకారునికి అర్పించిన చిరంజీవే అదృష్టవంతుడో మామా అల్లుళ్ళిద్దరూ "శాన్ థామ్ బీచీలో కూచొని........పిచ్చిక గూళ్ళు కట్టుకొంటో" తేల్చుకోవాలి.

విజయవాడ
7–11–'66

శ్రీనివాసచక్రవర్తి.

# శ్రీ ఆచార్య ఆత్రేయగారూ!

మనం శాంథోమ్ బీచ్‌లో కూచుని
సముద్రసంగీతాన్ని వింటో, తీయని
స్వప్నాల్ని కంటో, ఇసుక గూళ్లని
కట్టుకొంటో, గడిపిన రాత్రిళ్లకు
జ్ఞాపకంగా
ఇదుగో — స్వీకరించండి!

మీ
**చిరంజీవి**

.... ఈ సంపుటిలో

★ స్త్రీ

భారత మహిళామండలి, విజయవాడ శాఖవారి వార్షికోత్సవ సందర్భంలో ప్రదర్శితమయింది.

★ పునరాగమనం

ఆల్ ఇండియా రేడియో, విజయవాడ కేంద్రంనించి ప్రసారితమయింది.

★ నౌకాభంగం

ఆల్ ఇండియా రేడియో, విజయవాడ కేంద్రంనించి ప్రసారితమయింది.

★ అద్దంతిరిగింది

ప్రదర్శింపబడిన నాటిక.

★ బడిపంతులు

సరిక్రొత్త నాటిక.

## పాత్రలు :

* ప్రభాకరరావు
* కామేశ్వరి
* సూర్యారావు
* రవణి
* సుశీల
* వినోదిని
* కమల
* రాజమ్మ
* రంగమ్మ

సమయం : వర్తమానం

స్థానం : విజయవాడ

# స్త్రీ

(సూర్యారావుగారి ఇల్లు. ఆధునిక పరికరాలతో అమరినగది.)

రమణ, కామేశ్వరి కూచున్నారు. తెర లేచింది. ఒక నిమిషం.

కామేశ్వరి చేతిలో ఉన్న పరికరాల్ని పరిశీలనగా చూసి అవతల ఉంచి, రమణ వేపు చూసింది.

(రమణ 'మాగజేను' చూస్తూంది.)

కా: నాకూ తీరికంటూ ఉంటే, నీలాగే చక్కా అల్లుకుంటూ కూచుందును మరి!

ర: (నవ్వి) బావుందండీ మీ మాట! మీకు చేతినిండా బోలెడన్ని పనులుంటాయ్. తీరిగ్గా కూచుని అల్లడానికి అవకాశం ఉండొద్దూ? కోరిన రకాలు మీ ఇంటినిండా కోకొల్లలుగా ఉంటాయికదా; ఇంకా చేతులు విరుచుకుని అల్లిక పనెందుకండీ?

కా: సామెత చెప్పినట్టుంది నీ మాట! బజార్లో దొరకవనేనా-నువ్వుమాత్రం ఇవన్నీ అల్లుతూ కూచున్నావు? నీకు మాత్రం ఏం తక్కువమ్మా? అనుకున్నవన్నీ నోరు తెరిచి అడక్కముందే మేనేజరుగారే తెచ్చి పడేస్తున్నారు కదా!

ర: (చిరునవ్వుతో) వారు తేరని నే ననడంలేదు. కాలం గడవక ఇదోపని పెట్టుకున్నాను.

కా: అల్లుకోవడం నా కెంతో సరదా! కాని ఏం లాభం? ఇలాంటి చిన్నా చితక పనులు పెట్టుకున్న చూడానికి ఒక్క నిమిషమేనా తీరికుండదు మరి!

ర: అందులోనూ క్లబ్ పనులుకూడా ఉంటాయేమో...

కా: అవునవును. ఏదీ ఆ పని చేయడానికైనా తీరికేదీ? క్లబ్‌కి వార్షికోత్సవం వొచ్చే నెలలోనే జరుగుతుంది కూడాను.

ర: అదే విన్నాను నేనూను. పెద్ద ఎత్తునే జరపాలనే అనుకుంటున్నారట!

కా: జరిగితే పెద్ద ఎత్తునే జరపాలి మరి! ఏదీ ఆ గొడవలు చూడ్డానికి నిమిషం తీరడం లేదు. మొన్నల్లా కలెక్టర్ గారింట్లోనే సరిపోయింది... వాటిని తగలెయ్యా! ఆ కుక్క లెంతున్నాయనుకున్నావు? వాకిట్లోనే కట్టేశారు. దున్న పోతుల్లాగా ఉన్నాయి. నాకు చెడ్డ చీదర! కుక్కల్నీ పిల్లుల్నీ పెంచడం నా కసహ్యం. నిన్న డాక్టరుగారింట్లో చూద్దునుగదా, తెల్లటి పిల్లి ప్రత్యక్షం. గుండ్రంగా బలిసింది! డాక్టర్‌గారి మొహంలాగానే దానిదీను గుండు మొహం!

ర: డాక్టర్‌గారు మీకు వరస కాబోలు!

కా: వరసలకేం తక్కువలే! నీతో ఉన్న మాటంటున్నా నంతేలే? మళ్ళా రేపంతా రేడియో వారింట్లో కాల క్షేపం! ...

ర: సరే...ఇవాళల్లా మా ఇంట్లో గడిపేయండి!

కా: కనిపిస్తూనే ఉంది గా. రోజుకోచోట నడిచిపోతూంది. సభలూ, సమావేశాలంటే సరిపడదు కాని, యిలా నలుగురితో కాలక్షేపం అంటే హాయి నాకు !

ర: ఒక్కొక్కరికి ఒక్కొక్క అలవాటు లెండి !

కా: అలవాటు చేసుకుంటే అలవాటు అవుతుంది. కాకపోతే ఏమీ లేదు. నువ్వుమాత్రం ఇల్లు కదలకుండా కూచుంటావు. ఎలా తోస్తుందో, ఏమిటో మరి !

ర: అదీ ఒక అలవాటే లెండి !

(సూర్యారావు వొచ్చాడు.)

సూ: ఓహో ! వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు, మీరు ఇక్కడే వున్నారు.

కా: అంటే ... ?

సూ: ఇప్పుడే మీ వారిని 'టీ' కి పిలిచాను. మీ కోసంకూడా కబురు చేద్దామనుకుంటూ ఇంటికొచ్చాను.

కా: అంతేకదా భాగ్యం ! నేనూ రవణా ఇందాకే 'టీ' తీసుకున్నాం !

సూ: 'కడు అన్యాయం ! !'

ర: ఇప్పుడుమాత్రం పోయిందేమిటి లెద్దురూ ? మీకు జత మరొహరున్నారు కదా ?

సూ: ఒహరేమిటి — అన్నట్టు సుశీలావాళ్ళు కూడా వొస్తామన్నారు. రవణా ! కాస్త ఏర్పాట్లవీ గట్టిగా చూడు !

కా: ఇప్పటిన్నించే ఎందుకూ ?

సూ: కావాల్లెండి ! ఇదుగో చూడు రవణా ! నా కోసం కాకపోయినా, మీ స్నేహితుల నిమిత్తం అయినా కాస్త – నోరు తీయపడేట్టు చూడు !

ర: మంచివారేనండి మీరున్నూ. (నవ్వి) అయితే మళ్ళీ వొస్తాను. (రవణ లోపలికి వెళుతుంది)

సూ: ప్రభాకరరావు ఈ పాటికి రావలసిందే... ఇంకా...

కా: ఒస్తామని చెబితే, మావారు తప్పక వచ్చితీరతారులెండి ! సుశీలా వాళ్ళు ఎప్పుడు కన్పించారు ?

సూ: మధ్యాహ్నం ఎవో క్లబ్ పనులమీద తిరుగుతున్నారనుకుంటాను. ఇంటికి రావలసిందని చెప్పాను.

కా: మీ రవణను కూడా కాస్త బయటికి పంపిస్తుండండి ! నలుగుర్లో కలిసి తిరిగితేనే రాణిస్తారు !

సూ: నేను కాదన్నానటండి ? ఎన్నోసార్లు చెబుతూనేఉంటాను. ఆమె వెళితె నేను కాదన్నానా ?

కా: ఎవరికి వారే కదులుతారా ? ఎంతో ప్రోత్సాహం, చొరవా కావాలి !

సూ: కాస్త క్లబ్ కన్నా వెళుతూంటే మార్పు వొస్తుందని చూస్తుంటాను. అసలు వెళ్ళనే వెళ్ళదయ్యో !

(సుశీల ప్రవేశిస్తుంది. చురుకుదనం నిండిఉన్న వ్యక్తి.)

సూ: రండి, రండి, మీ మాట ఇప్పుడే అనుకున్నాం కూడా.

కా: కూచో సుశీలా !

సు: రవణ ఏదండీ ?

సూ: ఆమె స్నేహితుల ఆతిథ్యంకోసం ఏర్పాట్లు చూస్తూంది.

సు: సరే, ఆమె ఒంటరిగా వంటింట్లో ఉందా?

కా: ఏర్పాట్లు పురమాయించడమే ఆవిడ పని.

సూ: ఇప్పుడే వొచ్చేస్తుంది!

(ప్రభాకరరావు వొచ్చాడు. ప్రత్యభినందనలు పూర్తయ్యాక—)

ప్ర: మా సూర్యారావుకి సదా పదిమందితో కాలక్షేపం చెయ్యడం మహా సరదా! ...కాదుటోయ్?

సూ: ఎందుకైనా మంచిది మందితో బ్రతుకుతూంటే! ఒంటరిగా గూడు కట్టుకుంటే ఏం సుఖం! ఋషులంతటివాళ్ళే అడవుల్లోంచి జెండా పీకి, బస్తీలకి చేరుతున్నారు!

ప్ర: మరయితే, సంసారులందరూ అడవుల్లోకి సాగిపోవడం మంచిదేమో!

కా: అంతా మగవాళ్ళ చిత్తం!

సు: సాగితే సంసారం! సాగకపోతే సన్యాసత్వం!! సంసారులైనా, సన్యాసులైనా అవడానికి, మానడానికి మగవాళ్లకే చెల్లింది!

ప్ర: అదేం తప్పుకాదుకదా! మగవాళ్ళు అలా అవడానికి మూల బీజాలు చాలా మటుకు ఆడవాళ్ళు.

కా: అన్యాయమైన తీర్పు!

సూ: వాళ్ళ విషయంలో అలాంటి నిర్ణయం ఇవ్వడం మగవాళ్ళ అన్యాయానికి నిదర్శనం. మన మగవాళ్లకున్న అవకాశాలన్నీ ఆడవాళ్ళకీ ఉంటే సరి! ఒకరికొకరు భారం కానే కారు. సంసారాలు సాగరాలు కావు.

ప్ర: నువ్వెలాగూ వీరేశలింగంగారి శిష్యుడివి కాదుటోయ్ ? నీ కలాగే అనిపిస్తుంది !

కా: మీరు మాత్రం వీరేశలింగంగారి విరోధులా ? కాదుగా ?

ప్ర: అవ్వొచ్చు. కాని సూర్యారావు లాగా అంతా మమేకం అనలేను. ఎంతచెడ్డా మగవాళ్లు మగవాళ్లే, ఆడవాళ్ళు ఆడవాళ్ళే. అది ప్రకృతి సిద్ధంగా రాసిపెట్టిన శిలాక్షరాలు.

సు: దాన్ని కాదని ఎవరన్నారు ? ఉన్నపాళాన మగవాళ్లంతా ఆడవాళ్ళయిపోయి, ఆడవాళ్ళంతా మగవాళ్ళయి పోవాలని ఎవరూ కోరడం లేదు. కాని శక్తి సామర్థ్యాల్లో కాని, పనిపాటల్లో కాని స్త్రీలు పురుషులకంటే తీసిపోయారనే వాదం పనికిమాలిందంటాను.

ప్ర: ఈ సూత్రాన్ని చెప్పడానికి, చదవడానికి సరదాగానే ఉంటుంది, సుశీలా ! ఉదాహరణకి చాలా దొరుకుతాయి కూడాను. మా విజయలక్ష్మీపండిట్‌నీ, దుర్గాబాయినీ చూడండి ! ఇంగ్లండ్, అమెరికా, రష్యాల్లో ఎలా పనిచేస్తున్నారో ? అనీ అడగొచ్చు.

సూ: ఇవన్నీ కటిక అబద్ధాలని మీరూ అనరనుకుంటాను.

ప్ర: అబ్బే ! అవి అబద్ధాలని అనడంలేదు. నూటి కెంతమంది విజలక్ష్మి పండిట్‌లు ఉన్నారనేదే ప్రశ్న !

సు: అదా సంశయం ! బావుంది ; మీకున్న అవకాశాలిచ్చి కొన్నాళ్లు చూడండి ! ఈ మగవాళ్ళకంటే అన్ని విధాల ఆడవాళ్లే మెరుగనిపిస్తారో, లేదో ! !

ప్ర: ఆ విషయంలో తగాదా లేదు నాకు !

సూ: అంత దూరం ఆలోచన ఎందుకు ? కామేశ్వరిగారి విషయమే చూడండి...

ప్ర: అవునవును. సమయానికి సామరస్యం కుదిరింది. కామేశ్వరి కూడా ప్యాసయి ఉన్నట్లయితే ఎంత ... ఇదిగా ఉండేది ?

సూ: చెరో కోర్టులో కూచుని తీర్పులు ఇచ్చేవారు !

ప్ర: అదే నేనూ అనేది !

కా: ఎవరేనా వింటే నవ్విపోతారు కూడాను ! (నవ్వి) హాయిగా చదువుకుంటున్నదాన్నేగా ... కాని ;

ప్ర: ఆఁ ... 'కాని' ... అదే చెప్పు ...

సూ: ( అర్థం చేసుకుని ) ఆఁ పోనిద్దురు మీకు పుణ్యం ఉంటుంది ! ఆ 'కాని' దగ్గరే ఉభయులు ఆగిపోవడం ఎందుకైనా మంచిది ! ఆమె తిరిగి పరీక్ష కూర్చునే అవకాశం ఏదీ ?

ప్ర: అందుకే ఇందాక అన్నాను. స్త్రీలకు ప్రకృతి సిద్ధంగా కొన్ని విధులు ఏర్పడి ఉన్నాయి. పిల్లల్ని కనడం అనేది ఒక బాధ్యత; అది వాళ్ళకున్న సిరిసంపద...

సు: భగవంతుడంటూ ఒకడుంటే ; వాడిచేతిలో ఏదన్నా అధికారం అంటూ ఉంటే ; వాడు ఆ అధికారాన్ని వినియోగించి విధించిన మహాఘోరమైన శిక్ష అనేది ఏదన్నా ఉంటే ; అది ఇదొక్కటే – ఆడవాళ్ళకి వాడు విధించిన శిక్ష, పిల్లల్ని కనడం అనేదే !

ప్ర: అదీ ఒక శిక్షగా భావిస్తావా, సుశీలా ?

సు: ఆఁ, నిస్సందేహంగా. అది శిక్ష కాదు; 'మాతృత్వం'. అది స్త్రీల పాలిట వరప్రసాదం – అని అనమంటారు మీరు ! మాతృత్వం గురించి, దాని అదృష్టాన్ని గురించి ఆడవాళ్ల ఖర్మం కాలి మగవాళ్ళనించి పాఠాలు నేర్చుకోవలసి వొచ్చింది! అంత గొప్ప మాతృత్వయోగం కొన్నాళ్ళ పాటు మగవాళ్ళుకూడా భరించితే, అలాంటి అవకాశం లభిస్తే ఎంత బావుండును !

కా: అబ్బబ్బ ! సుశీలకి మగవాళ్ళమీద ఎంత కసి! ఎంత కసి!!

సు: నాకు మగవాళ్ళమీద కసిలేదు, జాలి ! వాళ్ళ నీచ అహంకారంమీద కసి !

సూ: దారుణం ! దారుణం !! దారుణమైన తిరుగుబాటు !!! (నవ్వుతారు)

ప్ర: ఆడవాళ్ళు పిల్లల్ని కనకపోతే సృష్టికి సౌందర్యం ఇంకే ముంటుంది ?

సు: పిల్లల్ని కనకూడదనీ, కనవద్దనీ నా అభిప్రాయంకాదు. కాని, కని తీరాలని ఆజ్ఞాపించడం; అది వాళ్ళ మొహాన రాసిపెట్టి ఉందనడం నీచమంటున్నాను. ఎదటివాళ్ళ లాలసతలకీ, అహంకారాలకీ ఆడవాళ్ళు బలికావాలా ? ఇక 'సృష్టి సౌందర్యం' విషయమంటారా ? అంతకన్నా పెద్ద అబద్ధం మరొకటి లేదు. కడుపునిండా తిండి ఉంటే, అన్ని సౌందర్యాలు మనిషిలోనే దొరుకుతాయి. ఇంతకీ మగవాళ్ళు పిల్లల్ని కన్నా 'సృష్టి సౌందర్యం' ఎక్కడికీ పారిపోదు !! (నవ్వుతారు)

కా: మీ చర్చలకి కష్టం తెగిపోయేటట్లున్నాయ్. అవతల క్లబ్ పనులలానే ఉంటాయ్. నాకేమో తీరికుండదమ్మా!

ర: (వొచ్చి, అతిథులందర్నీ ఆప్యాయంగా పలకరించి) ఆలస్యానికి మన్నించాలి!...

సు: మీకోసం ఎదురు చూస్తున్నాం!

ప్ర: మధ్య మధ్య మాతో దెబ్బలాడుతూ...

సూ: అదన్నా చాతయితే మంచిది!

కా: దెబ్బలాడితే మీకు సరదా కాబోలు! ఏవమ్మా రవణా! కాస్త బాక్సింగ్ నేర్చుకోక పోయావ్? (నవ్వుతారు)

ర: సుశీలగారూ! క్లబ్ వార్షికోత్సవాలు దగ్గర్లోనే ఉన్నాయనుకొంటాను.

సు: దగ్గర్లోనే ఉన్నాయి. మరి, మీలాంటి వారంతా ఇళ్ళల్లో కూచుండిపోతే, వార్షికోత్సవాలు దగ్గర్లో ఉన్నా ఒకటే, దూరంగా ఉన్నా ఒకటే!! కాస్త, మీరూ నలుగురితో కలిసి పాటుపడితేనే వార్షికోత్సవాల అందచందాలు!

కా: నేనూ అదే అంటున్నాను. నా కేమో తీరదు. తీరికున్న రవణ వంటివాళ్ళు కాస్త కదలకపోతే ఎలాగ? ఇందాక మేనేజరుగారిని కదిలిస్తే 'నా దేముంది' అంటారాయన!

ప్ర: ఏంవమ్మా రవణా! అన్నట్లు నువ్వూ కాస్త సుశీలా వాళ్ళతో కలిసి క్లబ్ వ్యవహారాలు చూడకూడదూ?

సూ: ఆవిడకు తగని భయం ఎందుకో తెలీదు. బయటికి పోవడమంటేనే జంకూ, గొంకూ...

ప్ర: ఆగవోయ్ సూర్యారావు! ఉన్నది దమ్మిడీపాటిదైతే, రూపాయంతచేసి చెబుతావు! ఏఁవమ్మా! నువ్వు చెబుదూ!

ర: ప్రత్యేక కారణం ఏమీలేదు, బాబయ్యగారూ! ఉన్న దాంటో తృప్తిగా జీవించడం మేలని ఒక పిచ్చినమ్మకం! అంతే, నలుగురితో వ్యవహారాల్లోకి దిగితే సమస్యలు! అవి తేనిపోనివే అనుకోండి! – కాళ్ళకూ, మెడకూ చుట్టు కుంటాయని భయం!

సు: బావుందండీ మీవంక! రైలు ప్రమాదాలు జరుగు తున్నాయికదా అని, రైలెక్కడం మానేస్తామటండీ? సమస్యలు వొస్తాయని సంఘసేవ చేయడం మానేస్తామా? అది న్యాయం కాదుగదా!

ప్ర: సమస్యలు వొస్తే పరిష్కరించాలి; కాని, సమస్యల్ని చూసి భయపడడం ఉచితం కాదమ్మా!

ర: పరిష్కరించే శక్తిసామర్థ్యాలు ఉండాలి కదండి!

సు: అవేవస్తాయి. అందరికీ మొదట్లోనే రావు. సమస్యలనేవి సంఘసేవ చేస్తేనేరావు. ఇంట్లో కూచున్నా తప్పవు. మానవత్వం, కరుణ ఉన్నవ్యక్తి ఎక్కడ కూచున్నా సమ స్యలు కనిపిస్తూనే ఉంటాయి.

సూ: నిజమైన మాట అదీ! హృదయంలో మానవత్వం తొణికిసలాడే వ్యక్తి అడవి గుడిసెలో ఉన్నా–లోకంలో పెచ్చుపెరిగే దారుణ అన్యాయాలు కనిపిస్తూనేఉంటాయి. అన్యాయాల్ని ఎదిరించాలనే కాంక్ష ఆ వ్యక్తుల్లో చావదు!

(వినోదిని ప్రవేశిస్తుంది. ముఖం చాల 'సీరియస్'గా ఉంది. అందర్నీ చూసింది. అందరి దృష్టి ఆమెమీదనే కేంద్రీకరింపబడి ఉంది!)

ర: రా, వినోదినీ! కూచో. అలా నిలబడిపోయావేఁ?

వి: (తెప్పరిల్లి) ఆఁ ఏమీలేదు, ఉండవలసినవారంతా ఇక్కడే ఉన్నారు.

సూ: ఏఁవిటి వినోదినీ! ఏఁవన్నా జరిగిందా?

కా: ఎప్పుడూ నవ్వుతూ పేలుతూ ఉండేదానివి. అంత తీవ్రమైపోతున్నావు? ఏఁవిటి చెప్పు!

సు: వినోదినీ! ఏఁవిటి...

(రమణ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి ఇస్తుంది. అవి త్రాగి వినోదిని రమణవేపు కృతజ్ఞతగా చూస్తుంది. ఆ తర్వాత ఉద్రేకాన్ని తనలో అణుచుకున్నట్టు, చెప్పదలచినదంతా చెప్పేందుకు సిద్ధంగా ఉన్నట్టు కనిపిస్తుంది. ఇక్కడనించి పాత్రలు ఆమె సాభినయ కథనానికి అనుకూలంగా నటించాలి.)

వి: చివరికి ఆడదాని బ్రతుకు ఎక్కడ తేలిందంటే – తనకు తాను బ్రతకడానికీ, లేదా స్వేచ్ఛగా చావడానికీ వీల్లేదన్న మాట!... అంతే నంటారా మేస్ట్రేట్‌గారూ?

ప్ర: ఎవిడెన్సూ, ఆర్గ్యుమెంటూ లేకుండా కేసు దాఖలు చేస్తే నేనేం చెయ్యను, ఫిర్యాదిగారూ?

సూ: వినోదినీ! అసలు విషయం ఏఁవిటో చెప్పు! కోర్టులో ఏమన్నా జరిగిందా...?

ప్ర: లేదు. అన్నీ వాయిదాలు వేసేవారం ఇది. విచారణలూ మన్నూ మశానం ఏమీలేదు!

వి: కోపం కూడా ఎందుకు? ఏం జరిగిందంటే – ఇవాళ ఉదయం నా దగ్గరికి ఓ అమ్మాయి వొచ్చింది

కా: అంతేకదా! ఎక్కణ్ణించి వొచ్చింది? చందాలకా?...

వి: చెబుతాను చందాలకు రాలేదు. సహాయంకోసం వొచ్చిందన్నా అన్యాయమే అవుతుంది. సాటి స్త్రీనించి సమాధానం పొందడానికి వొచ్చింది! తాను పడిన కష్టాలు, బాధలు చెప్పింది; సహాయం కోరింది!

ప్ర: ఎవరో దిక్కులేనిది కావొచ్చు! సహాయం కోరిందా? బావుంది!

వి: ఏ ఆడదానికైనా ఇలాంటి కష్టాల్లో దిక్కుంటూ ఒకటుంటేకదా, ఆవిడకి దిక్కుంటానికి? ఆవిడది ఈ ఊరేనట! తలిదండ్రులూ, అన్నా చెల్లెళ్ళూ – అందరూ ఉన్నారట! పరువు ప్రతిష్టలున్న కుటుంబమే వాళ్ళదీను.

సు: అయితే, ఏం జరిగింది?

వి: స్కూల్ ఫైనల్ కూడా చదివిందంట! ఎంత పరిశుభ్రమైన మనస్సు! అంత మెత్తని మనస్సు చూసి నాకే ఈర్ష్య పుట్టినంత పనయింది!

ప్ర: చదువుకున్న అమ్మాయా? సరే, తర్వాత...

వి: ఏం చదువుకుంటేనేం, ఎంత మానవత్వంతో బ్రతికితేనేం?

కా: అవును. ఇంకా చదువుతూనే ఉందా?

వి: లేదు చదువుకుంటాననే చెప్పింది. ఏం చెబితే ఏముంది? ఆవిడకి పెళ్ళి జరిగింది. చదువు పూర్తయ్యాక పెళ్ళి చేసుకుంటానందిట!

సు: ఆవిడ చదువుకుంటాననంటే తలిదండ్రులు ఒప్పుకోలేదా?

వి: ఎందు కొప్పుకుంటారు? లోకానికి 'మా పిల్లలకి కోరిన చదువు చెప్పించాం' అని చాటుకోడానికి వీలుగా అంత వరకు చెప్పించారు. చెప్పించిన అధికారాన్ని వినియోగించుకుని కాళ్ళూ చేతులూ కట్టి తమకు నచ్చిన పెళ్ళి చేశారు !

కా: పెళ్ళి అయినంతమాత్రాన ఏఁవిటి జరిగిందీ ?

వి: జరిగింది పెళ్ళికాదు, చావుపెళ్ళి. ఆ సంబంధం ఎలాంటిదో తెలుసా ? పెళ్లికొడుకు మొదటిపెళ్ళాం క్షయతో చచ్చిపోయిందట ! ఆవిడకి పిల్లలు కూడా !

సు: ఇది రెండో పెళ్ళన్నమాట ! అంత గుడ్డిగా తలిదండ్రులు ఎందు కంగీకరించారు ?

వి: ఎందు కంగీకరించరూ ? వాళ్ళకి కావలసిందల్లా ఊరూ పేరూ ఉండీ, నాలుగు డబ్బులున్న వ్యక్తి దొరికితే చాలు ! వాడెలాంటి వాడయితేనేం ? వాడితో కాపరం చేసేది తాము కాదుకదా !

ర: చాల అన్యాయంగానే ఉంది !

వి: అన్యాయమని నెమ్మదిగా అంటే లాభం ఏమిటి ? పెళ్ళికి ముందే తిండి తిప్పలు మానేసి ఏడ్చి గోలపెట్టిందట ! పెళ్లికొడుకున్న ప్రఖ్యాతిని అడ్డంపెట్టి, తలిదండ్రులు తమ పరువు నిల్పమన్నారట ! సంబంధం తెచ్చిన పెద్దలు మాత్రం సామాన్యులా ?

సు: ఎవరేమిటి ఆ పెద్దలు ?

వి: ఆ పెద్దలు పేర్లూ చెప్పింది నాకు. ఎవరో ఎరగనివారయితే ఇంతబాధ ఎందుకు? ఎవరో చెబుతాగా... ఆ పెద్దలతోనూ చెప్పిందట! 'నే నీ పెళ్ళికి ఇష్టపడడం లేదు. నేను చదువుకుంటాను' అని-ఏం చెబితేనేం? ఎవరి పరువు మర్యాదలు వారు చూచుకున్నారు. బలవంతాన మూడు ముళ్ళూ వేయించారు!

ప్ర: ఆవిడ ప్రాణాన్ని అంత ఉసూరు పెట్టడం ఎందుకు?

సూ: అంత బలవంతానికి బలి కాకపోతే, ఆ రోజునే బయటికి రాలేకిపోయుండా?

ర: ఆ మాత్రం సాహసమే ఆడవాళ్ళకుంటే ఇలా ఎందుకుంటుంది కథ?

వి: నిజం రమణా! ఆనాడామాత్రం సాహసమే చేస్తే చాలా మంది పెద్దలు తలలు నేలకు వాలివుండేవి. పెద్దల పరువు మర్యాదలకోసం ఆమె బలిఅయింది!

కా: ఇంతకీ భర్త విషయం చెప్పలేదు నువ్వు.

వి. చెప్పడానికేం? కావలసినంత పురాణం ఉందాయనకి! ముసలితనంలో, తను తన మొదటి భార్యతో కాపరం చేసినన్ని ఏళ్ళకల పిల్ల దొరికితే చాలు! అందులోనూ అన్నివిధాల యోగ్యత గల పిల్ల! దొరికిందే చాలనుకున్నాడా మహానీయుడు! తన కున్న వయసూ, కాలం, పోకడా గమనిస్తే - ఆ పసిబాలని పెళ్ళాడడంకన్నా చావడం మేలని తోచేది!

సు: నువ్వు చెప్పడం అయోమయంగా ఉంది? ఉద్రేకంలో నువ్వు వివరంగా చెప్పలేక పోతున్నావు?

వి: మీరూ ఆ అమ్మాయిని చూసిఉంటే, ఆ అమ్మాయి ఒంటిమీద వాతలు చూసిఉంటే, ఆ పుండ్లు చూసి ఉంటే–మీకూ తెలిసివొచ్చేది!

ర: హింసించడం కూడానా?

వి: సాధారణమైన హింసకాదు; ఆ రాక్షస హింసని ఎలా చెప్పను? ఆ దుర్మార్గుడి రాక్షసత్వానికి ఆమె ఒంటి మీది గాయాలు సాక్ష్యం. వాడు కొరికి గాయంచెయ్యని చోటులేదు!

ర: ఛి, ఛీ, పశువు!

వి: పశువుకి దయ, కరుణ ఉంది. కాని, ఈ నరపశువుకి ఆ అమ్మాయి మీద కనీసపు సానుభూతి లేదు. తన దుర్బలత్వం, నిస్సహాయత ఎక్కడ బయట పడిపోతుందో అని ఆమెని కొరికి, రక్కి గాయంచేసి సంతృప్తిపడ్డాడు. నడివీధిలో రాజకీయ వేత్తగా, సంఘోద్ధారకుడుగా కని పించేవాడు నట్టింట్లో రాక్షసుడు; పడకటింటో అధ ముడు; లోకంముందు నాయకుడు; ఇంటో ఇల్లాలి పాలిట నర పశువు!

సూ: ఆమె బ్రతుకు చాల దారుణమైపోయి ఉండాలి!

వి: అవును. పెళ్ళయిన మొదట్లో 'నువ్వు నా దేవతవి. నేను నీకు దాసినని' అని కాళ్ళు పట్టుకుని ఆమె దయని పొంద

డానికి ప్రయత్నించినవాడు, చివరికి కొరడాలాగా తయారయ్యాడు.

ర: పశువు భార్యని చూస్తే కవిత్వం కూడా వొచ్చింది కాబోలు !

వి: ఆమె కోరిన చదువు చదివిస్తానన్న ఆ మొగాడు, చదువు లేదు సరికదా, 'నీ మొఖానికి కందిపప్పు పచ్చడి సరిగా చెయ్యటం చేతకాదు' అనే పాఠంలోకి దిగాడు. వంటిల్లు దాటే తీరిక లేకుండా చేశాడు. పాతకాలం జబ్బులన్నీ ఆమెకి ధారాదత్తం చేశాడు. వెధవ బ్రతుకు...

సు: ఆమె నీ దగ్గరికి ఎలా వొచ్చింది !

వి: ఎలా వొచ్చిందో వచ్చింది. ఆ బాధలన్నీ చెప్పుకొని ఏడ్చింది. ఆ నరపశువు చేసిన గాయాన్ని చూపించింది. నా గుండె తరుక్కుపోయింది. నా కళ్ళకి ఇప్పటికీ ఆ గాయాలు ఎర్రగా కనిపిస్తున్నాయి. తనకు కొన్నాళ్ళ పాటు ఆశ్రయమిస్తే చాలన్నది. ఈ లోగా తాను స్వస్థత చెంది, తన బ్రతుకు తానే చూసుకుంటా నంది !

ర: అన్నట్టు ఆ అమ్మాయి దీ ఊరే నన్నావు? ఎవరమ్మాయి? మనకి తెలిసిన అమ్మాయేనా ?

సూ: ఇప్పుడా అమ్మాయి మీ ఇంట్లోనే ఉందా ?

వి: లేదు. ఆ అమ్మాయి మనకి తెలిసిన అమ్మాయే ! ఆమె మా ఇంట్లోనుంచి ఎలా వెళ్ళిపోయిందో ఏం చెప్పను ? ఆడవాళ్ళ బ్రతుకు ఇంత చులకనై పోయింది !

(ముఖం చేతుల మధ్య కప్పుకొంటుంది)

క: వినోదినీ ! ఆ అమ్మాయికి సహాయం చేసి రక్షించలేక పోయావా ? అంత దుర్బలురా లయ్యావా ?

వి: కాదక్కా ! ఆమె మా ఇంటికి వొచ్చిన కాసేపటికల్లా ఏం జరిగిందంటే—

(తెర పడిపోతుంది. వెంటనే రంగం మారిపోవాలి. అంతర్దృశ్యం ప్రారంభమవుతుంది. కమల వినోదిని దగ్గరిగా జరిగి ఉంటుంది! వినోదిని కమల నెత్తిమీద చేయి ఉంచి నిమురుతూ ఓదారుస్తుంటుంది.)

క: ఇదీ జరిగిందీ ! చెప్పవలసినదంతా చెప్పాను. ఎవరితో చెప్పుకోను ? చెప్పుకుంటే మర్యాద పోతుంది. చెప్పుకోక పోతే ప్రాణం పోతుంది!

వి: కమలా ! నీ విషయం, నీ పెళ్ళివిషయం లోకం మరోక విధంగా అనుకుంది ! ఎవరికి నిజం తెలుసు ? నాకున్న శక్తినంతా వినియోగించి నీకు సహాయం చేస్తాను.

క: కృతజ్ఞురాలిని. నానించి మీ కేమన్నా కష్టాలు వొస్తాయేమో ?

వి: ఏమీ రావు. సమాజంలో మీ వాళ్ళకు, నాకూ ఉన్న కృత్రిమ మర్యాదల కంటే – నీ జీవితమే నా కెక్కువ. మానవత్వంతో నిండిన నీ కన్నా – ఈ మొగమాటాలు నా కెక్కువకాదు. ఇలా చూడు ! విచారించకు !

(ఇంతలో బయటినించి ఏదో గొడవలు వినిపిస్తే వినోదిని, కమలా అటు చుస్తారు. ఇద్దరూ మరింత దగ్గరికి హత్తుకుంటారు.)

క: అదుగో, మా అమ్మా, పొరుగావిడా, మరెవరో మగ వాళ్లు వొస్తున్నారు.

వి: భయపడుతున్నావా ?

క: లేదు. రానని చెప్పేస్తాను. అన్నిటికి మీరే ఉన్నారుగా !

వి: ఆ; నా జీవితం ఉన్నంతవరకూ నీకు ఏ లోటు రాదు.

(కమల వినోదిని చేయి పట్టుకుని ఉంటుంది. 'కమలా ! కమలా !' అంటూ రాజమ్మ, రంగమ్మ ఇద్దరూ ఇంటోకి విసురుగా వొస్తారు. మగవాళ్లు ప్రేక్షకులకి కనిపించీ కనిపించనట్టు ఉంటారు. రాజమ్మ, రంగమ్మ కమల రెక్కలు పట్టుకుని గుంజుతారు)

క: నేను రాను. వొదలండి.

రా: రావటే ? ఎందుకు రావు ? అసలెందుకు వొచ్చావ్ ?

రం: రాదట ! ఊఁ రావా ?

క: నేను రాను.

రా: (మరింత గుంజుతూ) అంత తెలివి తేటలొచ్చినాయా నీకు ? నువ్వు రావడం రావడమా నీ తలలో జేజి కూడా వొస్తుంది !

వి: ఆగండి ! ఏమిటా దౌర్జన్యం ? గుడిసెల్లో వాళ్ళల్లాగా మర్యాద లేకుండా గుంజుతా రెందుకు ?

రా: మా అమ్మాయిని మేం అనుకుంటాం, వినుకుంటాం ; మధ్య మీ కెందుకు ?

రం: ఇందులో తమరి చెయ్యి ఎంత ఉందేమిటి ?

వి: మీ అమ్మాయిని మీరు అనడానికి హక్కుంటే, మా ఇంటో మేం అనడానికి హక్కు ఉంటుంది. మీరు నిజమైన తలిదండ్రులే అయితే, ఆ అమ్మాయి మీ

ఇంటికే వొచ్చేది. మధ్యన మా ఇంటికి రాదు. రాజమ్మ గారూ ! నలుగుర్లోనూ తిరిగే మీరే, ఇలాగ ప్రవర్తిస్తే ఇక ఇతరులమాట ?

రా: ఆ నలుగుర్లో తిరగడమే మాకీ రాత తెచ్చిపెట్టింది. ఏమే కమలా ! మధ్య నాకీ గోలేమిటీ ! పోదాంపద !

క: నేను రాను.

రం: నీకేం కష్టం వొచ్చిందని ఇక్కడికి పారిపోయొచ్చావు. నీ కాయనతో ఇష్టం లేకపోతే విడాకు లిద్దువుగాని పద ! నీ కిష్టం వచ్చినవాణ్ణి పెళ్ళి చేసుకుందువుగాని, నీకోరికలు కాదని మీ అమ్మా నాన్నా ఎప్పుడన్నారు? నువు చదువుకుంటా నంటావా, అదైనా సరే !

రా: ఆఖరికి మా పరువూ, చేసుకున్నాయన పరువూ గంగలో కల్పుతావా ? ఏడ్పుతో కని, పెంచి ఇరవై ఏళ్ళు కాపాడి నందుకా మాకీ రాత. తలగలిగిన మేస్ట్రేట్‌గారి మరదలై వుండి నీకీ పాడుబుద్ధు లేమిటే? మేస్ట్రేటుగారి మరదలు లేచిపోయిందంటే ఇంక, మాకు ఉప్పునీళ్లు పుడతాయా?

క: మేస్ట్రేట్‌గారి మరదల్ని అయితే నాకొరిగిందీ లేదు; రాజమ్మగారి కూతుర్నయినా నా కొరిగిందీ లేదు. పెళ్ళి జరక్కముందే చెప్పాను. నాకీ పెళ్ళి వొద్దని అందరికీ చెప్పాను. మేస్ట్రేటుగారికి తెలీదా? 40 ఏళ్ళ తమ్ముడికి నన్ను చేసుకోవాలని కోరడం ఎలాంటిదో ? నీకు తెలియదా ? నీకన్నా నీ అల్లుడి వయస్సు మూడేళ్ళు పెద్దఅని.

రా: అయ్యో, అయ్యో! మేజిస్ట్రేట్ గారి పరువు నలుగుర్లో ఎండేస్తావంటే...? అవన్నీ మనం ఇంటివద్ద మాటాడు కుందాం. నీ కిష్టం వచ్చినట్లు నువు ఉండవచ్చు.

కం: ఆఖరుసారిగా మా మాట నమ్మ. నువు ఈపూటకి వొచ్చి వుండు. రే ప్రొద్దున నీ ఇష్టంవొచ్చిన చోటికి వెళుదువు గాని. కావాలంటే వినోదిని దగ్గరకే వొచ్చేసెయ్.

రా: నిన్ను కట్టి పడెయ్యలేంకదా! రా! ఈ పూట మనం మాటాడుకుందాం.

వి: ఎంత చక్కగా బుజ్జగిస్తున్నారండీ!

రా: ఊఁ (చురచుర చూస్తుంది.)

వి: ఆవేళ పెళ్ళి బలవంతంగా చేశారంటే ప్రత్యక్షంగా చూడలేదు కాని, ఇవాళ, ఆ కమల్ని ఎలా బుజ్జగించి తీసుకుపోతున్నారో తెలుస్తుంది. కన్నతల్లివై ఉండికూడా సాటి స్త్రీ సంసారంలో ఎలాంటి బాధలు పడిందో ఒక్క నిముషంకూడా ఆలోచించలేక పోతున్నారు, మీరు. మీకు కావలసింది పరువు! ప్రతిష్ఠ! కూతురు సుఖపడ డంకాదు. కావలసింది; కూతుర్ని అమ్ముకుని ఎంత పరువు మర్యాదల్ని సమాజంలో కొనుక్కున్నామా అని.

రా: మాకీ ఉపన్యాసాలు వినడానికి తీరికలేదు. కమలా! రా. మళ్లా వొద్దువుగాని. ఒక్కగంట ఇంటివద్ద మాటాడు కుందాం. అంతే! నిన్ను కన్న తల్లిదండ్రుల్నే నమ్మలేవా!

క: (మెత్తపడి) సరే; అలేగే మాటాడి వొస్తాను. పదండి.

(రాజమ్మ, రంగమ్మ విజయగర్వంతో నడుస్తుంటే కమల తల వంచుకు పోతుంది. వినోదిని నిస్సహాయంగా చూస్తుంది)

వి: కటికవాళ్ళకన్నా దయ పుట్టవచ్చు కాని; పరువుని కొనుక్కు బ్రతికే ఈ మనుషుల గుండెల్లో దయకి తావులేదు! పాపం! కమలా, నీ బ్రతుకెలా అయిందమ్మా! తిరిగి బోనులోకే వెళ్ళుతూన్నావు! అది నీకు తెలీదు కదా!

(చప్పని తెగ వాలుతుంది. అంతర్ దృశ్యం ఆఖరు. మళ్ళా తెర లేచేసరికి మొదటి దృశ్యం ఎలా ఆఖరయిందో అలాగే అందరూ తమ తమస్థానాల్లో ఉండాలి. మేస్ట్రీట్ ముఖాన మాత్రం నెత్తురుండదు. వినోదినీ, రవణ కళ్ళవెంట నీళ్ళు కారుతాయి. ఇక—)

వి: జరిగిందేదో తెలిసింది కదా! కమల ఎవరో కూడా విన్నారు కదా! ఆమెకి జరిగిన ఈ దారుణ అన్యాయంలో ఎవరెవరు ఎంతెంత పాపాన్ని పంచుకొన్నారో, ఎవరికి వారికే తెలుస్తుంది!

కా: ఇలాంటి విషయాల్ని గురించి ఆలోచించడానికే నాకు తీరికుండదు.

ప్ర: నే నిలా జరుగుతుందని ఊహించలేదు. నా తమ్ముడికీ, నాకూ సంబంధం విడిపోయి పదేళ్ళయింది. చెరొక జిల్లాలో ఉంటున్నాం. మొన్న ఈ పెళ్ళితోనే తిరిగి సంబంధాలు ఏర్పడ్డాయి. నాకేం తెలుసు! ఇలాంటి సంఘటన అని.

వి: "ఇప్పుడు చూశారుగా! మీరు చట్టరీత్యాను చెప్పవచ్చు; న్యాయరీత్యాను చెప్పవచ్చు.

ప్ర: న్యాయానికీ, చట్టానికి సంబంధం ఏమీ లేదు. వినోదినీ! చట్టానికి నేను బానిసని. ఆత్మ న్యాయం చెప్పినా, నోరు చట్టాన్ని చదువుతుంది. తల ధర్మాన్ని పలికినా, చెయ్యి చట్టం రాస్తుంది. ఆత్మలు నశించి చట్టాల్ని పట్టుకు వేళ్ళాడుతున్నాం?

వి: పోనీ ఏ చట్టంలోనన్నా, ఇష్టంలేని మొగుడితో కాపరం చెయ్యమని ఉందా?

ప్ర: లేదు. అలా ఏ చట్టంలోనూ ఉండదు. కాని, లోకంలో ఏర్పడ్డ అలవాట్లు, ఆచారాలే పెద్దచట్టాలు! అవి నీతి అయినా అయిష్టమయినా పెళ్ళి చేసుకున్నవాడితో సర్దుకు పోవడమే సంఘం శాసించింది. సంఘానికి వ్యతిరేకించి నువ్వూ బ్రతకలేవు; నేనూ బ్రతకలేను.

ర: బాబయ్యగారూ! మీరు పెద్దవారు! చట్టాన్నిగురించి, సంఘంగురించీ మీరు చాల చదివి ఉంటారు. తెలుసుకునీ ఉంటారు. కాని, కమలలాంటి ఉత్తమురాల్ని, మన అందరికీ తెలుసు ఆ పిల్ల; అలాంటి అమ్మాయిని చూస్తూ చూస్తూ యిలాంటి చిత్రహింసలకి గురి కమ్మని నోటితో చెప్పడం చాల సాహసం! అలా గురి కమ్మని సంఘం కానీ, చట్టంకానీ, చెబితే, ఆ సంఘం, చట్టం ఉత్తచెత్త పోగు విలువన్నా ఉండవు. ఇంతకీ మీకు పిల్లా జెల్లా ఉన్నారు. అందరికీ ఉన్నారు.

ప్ర: ఉన్నారు కనకనే సంఘం విధించిన అభిప్రాయాలకి తల వొగ్గవలసి వొస్తోంది.

ర: అంటే, మీ పిల్లలు వ్యక్తత చెందేవరకూ, ఈనాటి ఈ పాతశాసనాలు, అలవాట్లు, ఇబ్బందులు, హింసలు, అన్యాయాలు, దారుణాలూ ఉండవలసిందేనా? వీటికి పరిష్కార మార్గం లేదంటారా?

సు: గట్టిగా ఆలోచించండి.

సూ: చాల దారుణమైన విషయం. కమల తండ్రి ఎంతో గొప్పవాడని భ్రమిశాను. మేస్ట్రేటుగారి తమ్ముడంటే ఊరూ నాడూ ఏకంగా కీర్తించిన నాయకుడన్నా రందరూ. కాని...

వి: లోకంలో పోయే దోవ ఒకటీ; అసలు బ్రతుకు ఒకటీ...

ర: కావలసింది చర్చలు కాదు. ఆ కమల బ్రతుకు ఏం కావాలనేదే ప్రశ్న! నిర్బంధాలు, కట్టుబాట్లు మనుషుల్ని కట్టివెయ్యలేవు. ఇవాళ ఒక్క కమలే కాదు. అలాంటి వాళ్ళు ఎందరున్నారో?...ఏమిటి వాళ్ళ జీవితాలకి పరిష్కారమార్గం. ఆ కమలే తిరిగివస్తే మీరు చెయ్యగల సాహాయం ఏమిటి చెప్పండి!

సు: ఈసారి సమావేశంలో ఒక తీర్మానం రాసి తీరాలి.

వి: ఇప్పుడు తీర్మానాలు తక్కువయ్యేనా? కామేశ్వరిగారు ఏవంటారు?

కా: నే నే మనడానికి, తీరికంటూ ఉంటేనా? తలలో లక్షకు మించిన సమస్యలు. ప్రతి ఆడదాని బ్రతుకూ ఇంచుమించు ఒకటే. బాధలు వేరు కావచ్చు. ఇలా బాధలున్నాయి కదా అని అలోచిస్తే మార్గంలేదు. ఆడదాని

బ్రతుకే అంత, బాధల పుట్ట! గొంగట్లో అన్నం తినడం మొదలెట్టాక, అన్నం నిండా ఉంటుంది. ఆడదై పుట్టాక అవస్తలు ఉంటాయి. అంతకుమించి ఇందులో రహస్యం ఏమీ లేదు.

సు: ఇదేనా మీ రనవలసింది? ఆడదానికి వేదాంతం ఉంటే చాలన్నమాట. ఇంతకీ, కమలే మీ ఇంటికొచ్చిందను కోండి! ఆదుక్కోరా?

కా: అది వేరే విషయం. ఇంటి యజమాని బాధ్యతమీద ఉంటుంది. మన బాధ్యత ఎంత; ఇష్టమైన వారిళ్ళకి వెళ్ళి వాళ్ళ మంచిచెడ్డల భోగట్టా సేకరించడంవరకే! అక్కడికి తీరికుండదు. అంతకుమించి స్వతంత్రం తీసుకున్నామా? ఎంతవరకు తల బైటికి పెడతామో అంతవరకు తల నరుక్కుపోతుంది. తనకు మాలిన ధర్మం ధరణిలో లేదన్నారు; నీలాంటి బుద్ధిమంతులు.

ర: ఇదేనా ఇన్నాళ్లూ మన స్వాతంత్ర్యం గురించి చాటుకునే చరిత్ర? ఎంత స్పష్టంగా కనిపిస్తోందీ?

వి: కామేశ్వరిగారు నిజం చెప్పారు. ఆమె హృదయంలో కరుణ, మానవత్వం లేక కాదు. అవి ఆడవాళ్ళకి ఉండ డమే నేరంగా లోకం తీర్పిచ్చిందని, ఆమె చెబుతున్నారు.

సూ: నలుగురిలో మొగమాటాలతో జీవితం గడిపే మనవంటి కుటుంబీకులకి ఇలాంటివి చాలా ఇబ్బందుల్ని తెస్తాయి. నా మనస్సు ఎంత పీకుతోందంటే – పాపం **కమల్ని** తలుచుకుంటే కన్నీళ్ళు వొస్తున్నాయి. కాని, మనం

ఆమెని చేరదీశా మనుకోండి. అవతలవాళ్ళ చుట్టుపక్కాలతో, ఇటు మేస్ట్రేట్‌గారిపక్షంతో ఎన్ని మొగమాటాలు తెగిపోతాయో ఆలోచించండి ! సంసారం అన్నతర్వాత ఇబ్బందులు వొస్తాయి. తిరుగుబాటు రావలసిందే ! కాని, సర్దుబాటు మెక్కువ కావాలి.

ర: ఔను. కావాలి ! ఈ కమలే మనం ముక్కూ మొఖం ఎరుగని అమ్మాయి కనక అయితే, వెంటనే పెద్ద సంఘోద్ధారకులమై పోయి ఆవిణ్ణి ఆదుకునే వాళ్ళం, పత్రికల్లో వేయించుకునేవాళ్ళం. అనాధ శరణాలయాలు తెరచి పరువుతో సంస్కారుల మనిపించుకునే వాళ్ళం ! ఇంతకీ – కమల అయిన సంబంధాల్లో పిల్ల అయిపోయింది. ఆమె తిరుగుబాటు మన పరువుకి భంగమయిపోతుంది. అంతేకదూ !

(ఇంతలో కమల హఠాత్తుగా వొస్తుంది. వీరందర్ని చూసి, చెదిరి వెనకడుగు వేస్తుంది. రవణ విసురుగా వెళ్ళి ఆవిణ్ణి పట్టుకుంటుంది. రవణ చేతిలో కమల వ్రాలిపోతుంది.)

వి: రా, తల్లీ ! రా ! మళ్ళీ బ్రతికి రాగలవని అనుకోలేక పోయాను.

క: (ఏడుస్తూ) ప్రాణాలమీద తెగించి వొచ్చేశాను. మళ్ళా పోను ; పోలేను. (రవణచేతిలో వొరిగిపోతుంది)

సు: పాపం ! ఎంత శ్రమపడిందో రావడానికి.

ప్ర: సూర్యారావూ, వొస్తాను. కలక్టర్‌గారితో ఎంగేజిమెంట్ ఉంది. వొస్తానోయ్. కామేశ్వరీ, వెళతావు కదూ ?

వి: ఆగండి. మేజిస్ట్రేట్ గారూ! మీరు వెళ్ళిపోయే ముందు ఒక్క ముక్క మాత్రం గుర్తు పెట్టుకోండి. ఆడది దొడ్లో కట్టేసే గొడ్డు కాదు. మన కుటుంబ గౌరవ ప్రతిష్ఠలకోసం పిల్లల గొంతులు కోయడంమాత్రం తగదని జ్ఞాపకం ఉంచుకోండి. మీ తమ్ముడెలాంటివాడో మీకు తెలియదంటే అంతకన్నా పచ్చి అబద్ధం మరోటి ఉండదు. ఈ పెళ్ళిలో మీ చెయి లేకపోతే జరిగేదికాదు. కాని, చేశారు–కానీయండి. ఫలితం ఏదో కళ్ళతో చూశారు. న్యాయానికీ, చట్టానికీ సంబంధం లేదన్నారు–ఇందాక మీరు. కాని, చాలమంది పెద్దలు చెప్పేదానికీ, చేసేదానికి సంబంధం లేకుండా పోయింది. బజారులో బ్రతుకువేరు; ఇంటి బ్రతుకు వేరు. కమల జీవితం నాశనం కావడంలో మీతమ్ముడి కెంతభాగం ఉందో, మీకూ అంతే భాగం ఉంది. ఇది మీ జీవితమంతా – ఒక భగ్నమైన స్త్రీ హృదయం – ప్రశ్నిస్తోనే ఉంటుందనే సంగతి మరచి పోకండి!

(ప్రభాకరరావు వెళ్ళిపోతాడు. కామేశ్వరి తటపటాయిస్తూ ఉంటుంది. రవణ కమల్ని వినోదినికి అప్పగించి, కామేశ్వరి కెదురుగా నిలబడుతుంది.)

ర: మీ బాధ నాకు తెలుసు. మేజిస్ట్రేట్‌గారి సంగతి మీకు బాగా తెలుసు. అయినా, మీ హృదయంలో కమలకు స్థానం ఉందన్న సంగతి నాకూ తెలుసు. పైకి కనుపించినంత కఠినులు కాదు మీరు. కమలకు మీ హృదయంలో స్థానం లేదా?

కా: ఉంది, రవణా! నాకు మొదట్నించీ తెలుసు. కాని, ఏం చెయ్యను రవణా! నా బ్రతుకు నడివీధికెక్కించుకో మంటావా? పరువు ప్రఖ్యాతులమధ్య నాలాంటివాళ్ళ బ్రతుకు ఎలా నలిగి పోతుందో మీకు ఇంకా తెలీదు. ఇంకా ఇంతకన్నా ఏం చెప్పినా ప్రయోజనం ఏముంది?

(కన్నీళ్ళు తుడుచుకుని లేచి కమల దగ్గరకు వెళ్ళి నిమురుతూ—)

నాకు తెలుసు కమలా! నా గుండెలు ఎలా మండి మండిపోతున్నాయో ఎవరికీ తెలీదు. ఏం చెయ్యగలను. నేనే ఒక బానిసని! అయినా, నీ జీవితానికి అడ్డంరాకుండా ఉంటే చాలు. అదే నేను చేయగల సహాయం. వొస్తాను మళ్ళీ. (కామేశ్వరి వెళ్ళిపోతుంది)

సు: జరగవలసినదేదో జరిగింది. సూర్యారావుగారూ! మీ అభిప్రాయం కూడా చెప్పవలసి ఉంటుంది. ఇప్పుడు కమల మీ యింటో ఉంది కనక - బాధ్యత మీకుంది.

సూ: ఏం చెప్పను సుశీలా! నేనూ విషయాన్ని అర్థంచేసుకో గలుగుతున్నాను. నా కెంత సానుభూతి ఉన్నా - నా వృత్తి ధర్మం 'బ్యాంకి' తెలుసుకదా! మరి దానికి ఎన్ని విఘాతాలు వొస్తాయో మరి! ఎటూ తెగించి చెప్పలేక పోతున్నాం. సరే, సరే, బాగా ఆలోచించి చెబుతాను. ప్రస్తుతం కమల వినోదిని ఇంటో ఉంటేనే మంచిదేమో! ఎందుకంటే - నేను ఎందుకు చెబుతున్నా నంటే - ఏమీ లేదు... (నీళ్ళు నములుతాడు)

వి: నాకేం భయంలేదు, సూర్యారావుగారూ ! కమల నా ఇంట్లోనే ఉంటుంది.

ర: అలా వీల్లేదు, వినోదినీ ! కమల నా చెల్లెలు. చెల్లెలి కష్టాల్లో అక్కకి భాగం ఉంటుంది. ఆ భాగాన్ని, బాధ్యతని ఎవరూ తొలగించలేరు. ఇక నిందలూ, అవహేళననంటావా ? అవంటే నాకు లెక్కలేదు. వృత్తి ధర్మాలకన్నా మానవత్వం, కరుణా విలువైనవి; వినోదినీ! కమల నా చెల్లెలు. ఈ ఇంట్లో నా కెంత హక్కుందో ఈ దిక్కులేని కమలకి అంత స్థానం ఉంది. కమలకి చోటు లేని రోజున రవణకీ చోటు ఉండదు.

వి: చాల సంతోషం, రవణా ! పేరుకు నీ ఇంటో ఉన్నా, కమల బాధ్యత మన అందరి దీనూ, రేపే క్లబ్ సమావేశంలో కమల విషయం చర్చించుదాం. క్లబ్ తరఫున ఆమెకి జరపగల సహాయం ఏమిటో చూద్దాం. ఒక ఆడదాని జీవితాన్ని కాపాడలేకపోతే — మనం వార్షికోత్సవాలు జరిపినా ఒకటే ! జరపకపోయినా ఒకటే —

ర: నిజమైనమాట ! సమస్యని సమస్యగానే పరిష్కరించాలి. కమలా ! ఎందుకమ్మా కన్నిళ్ళూ ?

క: ఏమీ లేదక్కా ! చాల రోజులకి మనుషుల మధ్యకు — నిజమైన మనుషుల మధ్యకు — రా గలిగాను. అదే సంతోషం.

[నేపథ్య సంగీతం]

కష్టాలను నష్టాలను
కని భయపడకండి
సాహసమే లక్ష్యంగా
సాగి నడవండీ !
కష్టాలని కలకాలం
కాపుర ముంటాయా ?
ఘోరంగా క్రూరంగా
బ్రతకడమా న్యాయం ?
కాదు కాదు లెండి లెండి
సంఘబలం కలదోయ్
సుఖ శాంతులు మనవేనోయ్
దుర్బలులం కామోయ్

---

# పునరాగమనం

(కోడికూసే వేళ....ఎక్కడో దూరాన అస్పష్టంగా మేలుకొలుపు.... క్రమేపి ప్రశాంత గంభీర వాతావరణం....గుడిగంటలమధ్య....)

"ఓం అసతో మా సద్గమయ
తమసోమాజ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

(అని వినిపించి ఆగిపోతుంది)

[కమల ఇంట్లో]

శాంత: (ఎక్కడినించో నడిచివొచ్చిన ఆయాసంవల్ల వగరుస్తో... బరువుగా నిట్టూరుస్తుంది. సంకోచిస్తో నెమ్మదిగా కమలని మేల్కొలుపుతుంది)

అక్కా!...కమలక్కా!...

కమల: (పూర్తి మెలకువరాని స్వరంతో) ఊఁ...

శాం: అక్కా! లే, కమలక్కా!...

క: అబ్బ! (ఆవలిస్తూ) ఎవరే?

శాం: నేనే! శాంతని కమలక్కా...

క: (మామూలు స్వరంతో) నువ్వా శాంతా?

శాం: ఆఁ నేనే!...

క: (ఆదుర్దాగా) ఇదేఁవిటే? ఇప్పుడొచ్చావ్?

శాం: వొచ్చేశాను.

క: అంటే ?

శాం: అంతే. వొచ్చేశానక్కా ... (నిట్టూరుస్తుంది)

క: సరిగా చెప్పవే. అతనేడీ ?

శాం: వొక్కదాన్నే వొచ్చేశాను.

క: జరిగిందేఁవిటో చెప్పవే ?

శాం: మూణ్ణాళ్ళ ముచ్చటయిందక్కా.

క: వొదిలేశాడా ?

శాం: ఏ రాయి అయితేనేం, పళ్ళూడిపోయాయ్.

క: హుఁ... సరే, బాగానేఉంది...

శాం: నామీద కోపం వొస్తోందా, అక్కా ? (బాధతో) నువ్వుకూడా నన్ను...

క: ఛ, పిచ్చిపిల్లా! నీమీద కోపతాపాలు నా కెందుకుంటయ్, చెప్పమ్మా...? నువ్వెంతో నేనూ అంతే... మనం ఆడ వాళ్ళం. (నవ్వి) ఆడవాళ్ళం కనక దేవతలం అవుదామని కలలు కంటాం... నిజానికి ఏమవుతామో తెలీదు... లోకం దృష్టిలో రాక్షసులం అవుతాం. చివరికి మనం ఏమీకాము ... ఆడవాళ్ళంగానే మిగిలిపోతాం ... అదంతా సరే... అసలేంజరిగిందో చెప్పు...

శాం: ఎక్కణ్ణుంచి చెప్పను ?

క: (నవ్వి) ఆ దేవదూత నిన్ను నరకకూపంనించి లాక్కుపోయి నప్పటినించీ చెప్పు, అతను నీకై తెరిచిన స్వర్గస్వర్ణద్వారాలు ఎలా తెరుచుకున్నాయో, వినైనా సంతోషిస్తాను...

శాం: నరకం ... స్వర్గం ... (కసిగా) నరకంలో వొళ్ళుమాత్రమే చెడుతుంది ... స్వర్గంలో మనసుకూడా కుళ్ళిపోతుం దక్కా! ... వేయి నరకాలకు మారుపేరే స్వర్గం ...

క: పోనిద్దూ ఏదో వొకటి, మనం ఎందునా పొందని ఉత్త ఆడవాళ్ళమని ఇప్పటికైనా తెలిసొచ్చిందిగా ...?

శాం: ఆఁ బాగా! ...

క: మరయితే చెప్పు ... నిన్న రాత్రి తీసుకుపోయాడు ... ఊఁ తర్వాత ?

శాం: అతని గదికే తీసుకుపోయాడు. దోవ పొడుగునా నన్ను ధరించడానికి తను ఎలాంటి ఏర్పాట్లు చెయ్యదలచుకున్నాడో అవన్నీ చెప్పుకొచ్చాడు ...

క: ఇంకేం, వింటూంటేనే కలలు వొచ్చి ఉంటాయి నీకు ... (నవ్వుతూ) ఎంచక్కటి కలలో! ...

శాం: కల వల్లకాదు! అంత చీకట్లోకూడా సిగ్గుతో నా మనసూ, వొళ్ళూ ముడుచుకుపోయాయి ...

క: ఐతే, అంత చక్కగా ఊరించాడూ నిన్ను ! సరే ... తర్వాత?

శాం: అతని గదిలో దీపంకూడా లేదు ... ఏదో బల్లచెక్క చూసుకుని దానిమీద పడుకున్నాను. కాని నిద్రపట్ట లేదు. మేలుకునే ఉన్నాను ...

క: కాస్త ఆగు ... అతని పేరు?

శాం: చంద్రం ... తర్వాత ... ఏంజరిగిందంటే ...

* * *

(ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వని)

(చంద్రం గదిలో)

చంద్రం: ఒరేయి గోపీ!... లేవరా, మొద్దూ!...

గోపీ: అబ్బబ్బబ్బ!... ఎవర్రా చిట్టెలికలాగా...

చం: నేనే చంద్రాన్ని, లేవరా గోపీ, నోర్మూసుకుని లే!... ఆమె వొచ్చింది...

గో: లేచాను. ఆమె అంటే ఎవర్రా?

చం: అరవకు, ఆమె నిద్రపోతోంది...

గో: చచ్చాం పో, ఆమె రావడం, నిద్రపోవడం, ఇదంతా ఎప్పుడు? ఆమె... పేరన్నా చెప్పు...

చం: శాంత! ఒక నిస్సహాయురాలు... జీవితంలో చీకటితప్ప వెలుగు ఎరగదు. సంఘుచ్యుతురాలు...

గో: ఈ బిరుదులు చాలవ్రా? ఇంకెందుకులే... విన్నాం!...

చం: నువ్వు విని తీరాలిరా; గోపీ! నీకన్నా ఆప్తులు నాకెవరూ లేరు... ఇంత చదువు చదువుకుని... మనం చేయవలసిన ధర్మం ఏదన్నా ఉందంటే... ఇదే... ఇదే!

గో: ధర్మం కాదు, మనకు పట్టిన కర్మం అను సరిపోతుంది.

చం: ఏమయినా సరే, నా మనసుకి మంచి అని తోచింది. చేశాను...

గో: మంచేమిటి, చెడ్డేమిటి భాయ్... మనసు చెబుతుంది, మనం చేస్తాం. మనం చేస్తాం, మనసు పంతకం పెడుతుంది. అది చెల్లుతుంది. అంతే... సరేకాని—

చం: కానీ గీనీ లేదు. నాకున్న సర్వస్వం వెచ్చించి అయినా సరే ఆమెని తిరిగి సంఘంలో గౌరవప్రదంగా జీవించే మనిషిగా, తయారుచేస్తాను...

గో: తప్పక చెయ్... చచ్చిన నీ పితృదేవతలు సంతోషిస్తారు... బస్... అంటే ఆవిణ్ణి నువ్వు పెళ్ళాడతావా?

చం: ఛ, అదేం మాటరా ? ఆవిణ్ణి యోగ్యురాలిని చేశాక, ఆవిడ ఇష్టంవొచ్చినవాణ్ణి పెళ్ళాడుతుంది. అదంతా వేరే సమస్య.

గో: అయితే మరెందుకు తీసుకొచ్చినట్టు ?

చం: నోర్ముయ్‌రా. ఆవిణ్ణి ఉద్ధరించాలని, ఆ నీచ జీవితం లోంచి, నరకంలోంచి తీసుకొచ్చాను.

గో: వేశ్యకి జీసస్ ముక్తి యిచ్చినట్లు...

చం: ఈమాత్రందానికి జీసస్‌తో పోల్చుకోడం అనవసరం... ఏఁవిటి మరి ? నీ విషయం చెప్పు...

గో: నన్నింకో గది చూసుకోమంటావా ?

చం: మళ్ళా అదేం గొడవ... నువ్వూ, నేనెంతో ఆమెకూడా అంతే! నువ్వీ గదిలోనే ఉండి తీరాలి...

గో: ఐతే, సమస్యేలేదు. నే నేం చెయ్యాలో చెప్పు... వంట పెట్టిస్తావా ?... బజారునుంచి సామాన్లు తెస్తాను. ఆవిణ్ణి చదివిస్తావా ? నే నే వంటచేస్తాను...

చం: అవసరమైతే అన్నీ చేసుకుందాం, తప్పేముంది ?

గో: ఏం లేదు, ముందు డబ్బెంత నిల్వఉందో చూడాలి.

చం: వెయ్యిరూపాయిలున్నాయి. ఈలోగా ఏదన్నా ఉద్యోగం చూస్తాను...

గో: కోర్సు పూర్తి చెయ్యవా ?

చం: చదివింది చాలు... ఇక, జీవితమే ఒక చదువు...

గో: ఇదెక్కడి యోగంరా గురూ...

చం: నోర్మూయరా శిష్యా...

(పనిమనిషి తలుపు కొడుతూ 'బాబుగారూ' అని పిలుస్తుంది.)

గో: చచ్చాంరా బాబూ, ఈవిణ్ణి పని మనిషి చూస్తే ?

చం: ఏం చూస్తే? మన చెల్లెళ్ళు మన గదుల్లోవుంటే ఏం తప్పు ?

గో: సరే, తలుపు తీస్తాను.

అప్పలమ్మ: తెల్లకు తెల్లారినా తలుపు తీయకపోతే యెట్టా బాబూ !...నాలుగిళ్ళల్లో పాచిపని చెయ్యాలి...

గో: అప్పలమ్మా, రేపటినించి పాచిపనే కాదు, అంట్లుకూడా తోమాలి.

అప్ప: వంటెడతారేటి బాబు ? ఆవిడెవరు బాబూ ?

చం: మా చుట్టం, అప్పలమ్మా ! చప్పుడు చెయ్యకుండా ఊడ్చిపో...

అప్ప: అట్టాగే...ఎంత చుట్టమయినా, తెల్లారినా లేవకుండా పడుకున్నారేటి, బాబూ !

చం: ఊఁ నీ కెందుకా గొడవ ? రాత్రంతా రైల్లో ప్రయాణం చేసి వొచ్చారులే...

అప్పు: సరే బాబూ... మా దొరసానా బాబూ !...

గో: అప్పలమ్మా, నోరుమూసుకుని ఊడ్చేయ్...

అప్పు: అట్టాగే బాబూ...

చం: గోపీ, నువ్వు బజారుకు వెళ్ళి రావాలిరా ?

గో: ఎందుకు ? వంట రేపటినించి కదా... ఈ రోజు హోటల్ నించి తెప్పిద్దాం.

చం: కాస్త కాఫీ ఫలహారాలు తెద్దూ ! మొద్దు, అన్నీ చెప్పాలి...

అప్పు: వెళుతున్నాను, బాబుగారూ ! రేపట్నించి అంట్లు తోమిపోతాను... (అప్పలమ్మ వెళుతుంది)

గో: రైటో... వెళ్లు. సరే చంద్రం ! డబ్బులు తే మరి, వెళ్ళొస్తా...

చం: నీ మొహం. ఫ్లాస్కు తీసుకు పో...

గో: సారీ... అలాగే...

(గోపీ వెళతాడు)

చం: శాంతా ! శాంతా !!...

శాం: (బద్ధకంగా లేస్తున్నట్టు) అబ్బ ! నిద్రేపట్టలేదు. లేపేస్తున్నారు.

చం: తెల్లారేసరికి లేవడం అలవాటు చేసుకోవాలి, శాంతా!...

శాం: ఏమో బాబూ!... పగలల్లా నిద్రపోవడం ఇన్నాళ్ళూ అలవాటు. సరే అలాగే పొద్దున్నే లేస్తాను. సరేనా ?

చం: బావుంది. ఈ గదిలో మనం ముగ్గురం ఉందాం. వంట మనమే చేసుకుందాం.

శాం: వంటా ? నా కదేమిటో తెలీదు. వంటచెయ్యవలసిన అవసరం నా కెన్నడూ రాలేదు.

చం: ఆ పాత జీవితంలోని అలవాట్లన్నీ మరి మారిపోవాలి. నువ్విప్పుడు నాగరికతలోకి, సంఘంలోకి వస్తున్నావు.

శాం: అంటే, నా కర్థం అయితేనా ?

చం: తప్పకుండా అర్థం అవుతుంది. నాలుగు రోజులు గడిచేసరికి, అన్నీ నీకే తెలుస్తాయి.

శాం: అలాగే. మీరు చెప్పినట్టు చేస్తాను.

చం: పత్రికలూ, పుస్తకాలూ విరివిగా చదవాలి.

శా: చదవడమా ? బొత్తిగా గిట్టనిపని. సినిమాలు చూస్తాను. (నవ్వుతుంది)

చం: చూడొచ్చు. కాని, నీకు చదువు సరిగా రాకపోతే, ఇక్కడ సంఘంలో మెలగడం కష్టమవుతుంది.

శాం: సంఘం ఏమిటి ? నన్ను తెచ్చిన మీరు ఉన్నారు. అంతేచాలు నాకు.

చం: అలా వీల్లేదు. సంఘంనించి మీరు ఎందుకు దూరమైపోయి, ఆ అవినీతి జీవనంలో ఎలా నిస్సహాయులై నశిస్తున్నారో, ...నువ్వు సంఘానికి చూపించాలి. విద్యా, గౌరవాలవల్ల నూతనమార్గాన్ని సాధించాలి.

శాం: ఏమిటో పెద్దవిషయాలు చెబుతున్నారు. నా లాంటి దాన్ని ఎందుకిలా బాగుచేయాలని ప్రయత్నించడం... పోనీ, నన్ను పంపించరాదూ ?

చం: శాంతా! మళ్ళా ఆచీకటివేపు, ఆ అవినీతి, మృత్యువేపు చూడకు... నీ కోసం నా జీవితాన్ని అర్పించదలచుకున్నాను...

శాం: (గద్గదికంగా) సరే ఐతే ఇలా రండి...

చం: నన్ను ముట్టుకోకు... మనం...

శాం: ఇలా నా పక్కనే కూచోండి మనం ఎవరమైతేనేం, ఒకరికొకరం కావలసిన వాళ్ళం.

చం: నిజమే, కాదనను. వేరే భావింపకు. నేను నీ విషయంలో చాలా ఆలోచిస్తున్నాను.

శాం: (కిలకిల నవ్వి) అందుకే ఇలా వచ్చి కూచోండి... నేను మిమ్మల్ని పూర్తిగా నమ్మాను... మీరు నాకోసం ఎలా జీవితాన్ని అర్పించారో, అలాగే నేనూను. రండి.

చం: శాంతా! ఉండు, నీ పట్ల నా కెలాంటి ఉద్దేశ్యం లేదు.

శాం: (నవ్వి) అంటే?

చం: నువ్వు నవ్వకు, నా కదోలా ఉంటుంది...

శాం: ఐతే, మరి నన్నెందుకు తీసుకొచ్చినట్టు?

చం: అదేం ప్రశ్న శాంతా? నిన్ను సంఘంలో గౌరవం పొందగల స్త్రీగా తయారుచేయడానికి. సర్వవిషయాలు అనుభవమయ్యాక, నువ్వు నీ ఇష్టంవొచ్చిన వారి నెవరి నైనా సరే పెళ్ళాడి, కుటుంబీకురాలివి కావాలి...

శాం: బావుంది. (నవ్వి) పిల్లల్ని కనాలా !

చం: తప్పకుండా మాతృమూర్తివి కావాలి.

శాం: అయితే, మీరే నన్ను పెళ్ళాడండి.

చం: తొందరపడకు... ఇంకా కొన్నాళ్ళు పోనివ్వు...

శాం: ఎందుకూ ? మీకూ నాకూ మధ్య ఇంక సందేహం ఏముంది ?

చం: ఏమీ లేదు, కాని నాకా ఉద్దేశ్యం ఇపుడు లేదు.

శాం: మరయితే, రాత్రి అక్కడి కెందుకొచ్చారు ? డబ్బు గుప్పి ఆనందించడానికా ?

చం: అదివేరు. ఇపుడు నీవూ నేనూ సాధించవలసినది పూర్తి మార్పు. నిన్ను తిరిగి పునరుజ్జీవింప చేస్తానని వాగ్దానం ఇచ్చాను.

శాం: అందుకే నన్ను దూరంగా నెట్టకండి. దగ్గరగా ఉంటేనే మీలో ఐక్యమైపోతాను. రండి.

చం: (ఊపిరి బిగబట్టి) శాంతా!... శాంతా!... ...

శాం: నా దేవతలు మీరు, అందుకే... అందుకే.

(ఫ్లాష్‌బాక్ ముగిసిన సూచన ధ్వనులు)

(కమల ఇంట్లో)

కమల: సరే, కథ ఇలా నడిచిందన్నమాట... నువ్వు తొందర పడ్డావా ?

శాం: అదేమిటక్కా, నువ్వూ అలా అడుగుతున్నావు? ఆ పరిస్థితుల్లో నాకంతే తెలిసింది...

క: తర్వాత ?

శాం: మరెన్నడూ అలా జరక్కూడదని నన్ను హెచ్చరించాడు. అలా జరిగినందుకు సిగ్గుపడ్డాడు... ...ఆతర్వాత, వంటా గింటా ప్రారంభమయింది. అంతా నాకు కొత్త...

క: అతను మళ్ళా...

శాం: అవును, పగలంతా నిగ్రహించుకున్నా, రాత్రిళ్ళు మామధ్య నిగ్రహం సాధ్యంకాలేదు. కాని, అతడు అది రహస్యంగానే ఉంచాలని అనుకున్నాడు.

క: అదే, అనర్థాలకి మూలం. మరి, అతని స్నేహితులో...

శాం: అదంతా వో పెద్ద తమాషా. నలుగుర్లో తిరగాలనీ, అందరితో కలిసి తినాలనీ చెప్పాడు. ఎంత వద్దని చెప్పినా వినలేదు.

క: అందరికీ నువ్వు...

శాం: నేనో నిరాశ్రయురాలిననీ, నాకు చదువుసంధ్యలు చెప్పించి స్త్రీ ఎలా నిలబడగలదో ఋజువు చేస్తాననీ చెప్పేవాడు.

క: వంటతోనే ఆగిందా నీ చదువు?

శాం: కాదు. నాకు చదువు చెప్పడానికి ఒక మాస్టారుని పెట్టాడు. రెణ్ణెలలో చాలా కష్టపడి నేర్చుకున్నాను. రోజురోజుకీ — చంద్రంపట్ల నా హృదయం హత్తుకు పోయింది...

క: ఊఁ, ప్రేమించానంటావ్?

శాం: నిజమంటే. నా జీవితంలో ఎందరితో పరిచయమున్నా ఉత్తయంత్రాన్నే. కాని, అతని అమాయకత్వం, నిర్మల హృదయం నన్ను కదిలించాయి. పాతజీవిత స్మృతుల్ని నాలోంచి దూరంచేశాను. అతనే నా సర్వస్వమని భావించాను.

క: పతివ్రత వయ్యావన్నమాట ?

శాం: అక్కా ! దరిద్రం, అజ్ఞానంవల్ల అల్లాడే ఆడది—డబ్బువల్లా, మగవారివల్లా ఓడిపోతే, అది నేరమా? కాదు, అంచేత నేను మనసారా ప్రేమించాను. అతనికి ద్రోహం చెయ్యలేదు ... అది చాలదా... నా గత జీవితాన్ని తుడిచేందుకు?

క: ఊఁ! ఇంకా నీకు ఆ జీవితంలోని మాయ తొలగలేదు... సరే, తర్వాత కథ ?

శాం: నాకు చదువు చెప్పే మాస్టారు అతని స్నేహితుడే, కాని...

క: నిన్నేం వలచాడా ?

శాం: సాహసించలేకపోయాడు. నా ప్రత్యణువులో చంద్రం జీవిస్తున్నంతకాలం, నన్నెవరూ భ్రమపెట్టలేరు. ఒక రోజున, ఆరోజే, నా దురదృష్టానికి నాంది. ఆ రోజున నేను మామూలుగా చదువుతున్నాను.

(ఫ్లాష్‌బాక్‌ని సూచించే ధ్వనులు)

(చంద్రం గదిలో)

మాస్టా: శాంతా ...

శాంత: ఏఁవిటండీ మాస్టరుగారూ ?

మా: అబ్బెబ్బె! ఏం లేదు...నాకేఁవిటో అదోలాగ ఉంది.

శాం: అదోలాగ అంటే...

మా: నిన్ను చూస్తున్నానుకదూ?

శాం: నన్ను చూస్తే ... (నవ్వి) వికారంగా ఉందా?

మా: అవును శాంతా !

శాం: ముందు చెయ్యితీసి మాట్లాడండి.

మా: అంటే, నా భావం అర్థంకాలేదా ?

శాం: అర్థం కానంత చిన్నపిల్లనికాను.

మా: మరెందుకు సంశయం ?

శాం: మీరు నాకు చదువుచెప్పిన గురువులు. అందుకు మిమ్మల్ని ఈ పరిస్థితుల్లో క్షమించగలిగాను. నేను చంద్రంగారి...

మా: చంద్రంగారి ప్రియురాలివి. అయితే నేం, నీకు ఇటు వంటిది కొత్త కాదుగదా...

శాం: (నవ్వి) మనిషి మారిపోవచ్చనే సత్యంకూడా గమనించని అజ్ఞానంలో ఉన్నారేమండీ, మేస్టారూ?

మా: నీ ఇష్టంవచ్చినట్టు అను... కాని, నాకోరికతీర్చు. నువ్వేం సతీ అనసూయవు కావు.

శాం: పోనీ, అనసూయ తల్లిననా కావచ్చుగా... మళ్ళా మీరు,... చెయ్యి తీసెయ్యండి...

మా: పోనీ, ఎప్పుడో చెప్పు...

శాం: అలాంటి ఆశలు మీకు తగవు. నన్ను గురించి ఇకముం దెన్నడూ పొరబాటు అభిప్రాయానికి రాకండి.

మా: లోకంకళ్ళు మూస్తావా, శాంతా? ఇన్నాళ్ళూ నేను నిన్ను కోరలేదు. ఇప్పుడు నేను కోరుతున్నాను. ఇది నీకు బేసబబైన విషయం ఏమీకాదు. పోనీ డబ్బు కావాలా?

శాం: మీరింక ఈ విషయం కట్టిపెడితే సంతోషిస్తాను.

(తలుపు తడుతూ చంద్రం 'శాంతా శాంతా' అని పిలుస్తాడు.)

శాం: ఆయన వొచ్చారు. మీ రిలాంటి ప్రస్తావన మరచిపొండి. మామూలుగా ఉందాం.

చం: ఇదేవిటి ? ఇద్దరూ చదువుతున్నట్టు లేరు...

మా: ఏం లేదోయ్ చంద్రం, రేపటినించి నేను వచ్చి శాంతకి చదువు చెప్పడం కుదరదు.

చం: అదేఁవిటి ! కనీసం కోర్సు పూర్తి కానివ్వు !

మా: వీల్లేదు...నాకు వేరేపనులు తగిలాయ్...వస్తానోయ్...

చం: అదేఁవిటి శాంతా! ఏవన్నా జరిగిందా ?

శాం: అబ్బే ఏం లేదండి...

చం: ఏం లేదా? సరే...ఏం లేందే ఎందుకు రానంటాడు ?

శాం: ఆయన రాకపోతే మరో మేస్టారుని చూద్దాం !

చం: సరే !

శాం: అన్నట్టు...అడుగుదామని...మరిచేపోయాను. కుట్టు మిషను సంగతి యేంచేశారు...?

చం: ఎందుకదీ...? చెబితే వినవ్వూ...?

శాం: మీరలా మూతిబిగిస్తే నేను భరించలేను. చూడండి... మీవద్ద డబ్బుకూడా అయిపోతుంది. ఇపుడే మిషన్ కొంటే—నేనూ నాలుగురాళ్లు సంపాదిస్తాగా.

చం: సంపాదన ! యేం తొందర...మొన్న మొన్నటిదాకా సంపాదనేగా...

శాం: మీరు అపార్థం తీస్తున్నారు. డబ్బు చిక్కు మీకైనా, నాకైనా వొకటేగా ? అందుకని, చేతిలోవున్న నాలుగు డబ్బులూ అయిపోకముందే - నేను మిషన్ కుడతాను.

చం: వొద్దులే. ముందు, నువ్వు చక్కని అల్లికపనులు నేర్చుకో, సంగీతం నేర్చుకో. అంతేగాని, మిషన్ కుట్టడమేంటి ? ఉత్త నాన్సెన్స్.

శాం: మీ యిష్టం. అల్లికపనులూ యివన్నీ మనకెందుకు చెప్పండి ... ?

చం: అదుగో మళ్ళా మొదలు. నీలో మార్పురావాలంటే— నువ్వూ సంఘంలోని పెద్దల్లాగానే తయారవాలి. ఆ నాగరికత నేర్చుకోవాలి. ప్లీడర్ రుద్రమాంబని చూశావ్ గా, వాళ్ళంతా యెలా వున్నారు ? అలా తయారవాలి.

శాం: ఊఁ... సరే. మంచిపోలికే తెచ్చారు. వాళ్ళందరి సంగతి మీ కన్నా, నాకే యెక్కువ తెలుసు.

చం: అంటే ... ?

శాం: పోనిద్దురూ ... ఆడవాళ్ళం— నాలాంటివాళ్ళకి వాళ్ళ లోతుపాతులు తెలుస్తయ్. మగవాళ్ళు, మీకు తెలీవు. పోనీండి. గోపి యేడి ... ?

చం: ఎల్లుండి మన యింట్లో టీపార్టీ పెట్టాను. గోపీ అందర్నీ పిలవడానికి వెళ్ళాడు. అందరూ వస్తారు. ఆ వేళతో— నీకు యీ తెరచాటుపద్ధతి స్వస్తి.

శాం: ఎందుకిలాంటివన్నీ తలపెడతారు ?

చం: శాంతా ! నీకు తెలీదు. నిన్ను నాగరికురాల్ని చేసే బాధ్యత నాది.

(ఫ్లాష్ బాక్ ముగిసిన సూచన ధ్వనులు.)

(కమల ఇంట్లో)

క: సరే... మాష్టారు కన్నేశారు. చంద్రం అనుమానించాడు. రామాయణంలో పిడకలవేట ప్రారంభమయిందన్నమాట.

శాం: అవునక్కా! ఎంతచెప్పినా ఆయన వినలేదు. టీపార్టీ పెట్టితీరాలన్నాడు. ఏం చెయ్యను? నా జీవితంలో మళ్లామేదో ఉపద్రవంవచ్చి పడుతుందనే అనుమానం వెంటాడింది.

క: టీపార్టీ చేస్తే మేం కలిసొస్తుందని...?

శాం: నాకు పవిత్రత కలుగుతుందట! నేనూ సంఘంలో స్థానం సంపాదించగలనట!

క: సరే—టీపార్టీ జరిగింది. ఆతర్వాత...

శాం: టీపార్టీ ఊరికే జరగలేదు. అక్కడే ఒక ఆడదాన్ని నాగరిక సంఘం చిత్రవధచేసింది. అది టీపార్టీకాదు, నా జీవితంమీద నాగరికులు మోపిన నేరారోపణ.

క: అలాగా! టీపార్టీలోనే?

శాం: అవును, టీపార్టీ అవుతూండగానే—

(ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వనులు)

(చంద్రం గదివద్ద)

ఒకరు: ఒరేయ్ అబ్బాయి, యీ పిట్ట యెక్కడిదిరా...?

రెండు: ఎక్కడిదోమరి? చంద్రంవలలో పడింది.

మూడు: ఓస్! దీనిసంగతే తెలీదా? పేరు శాంత. మొగం మెరిగిన మనిషిలే.

రెం: అలా చెప్పు. మెరకవీధి లలన అంటావ్ ... ?

ఒ: వాడు వాగడానికేంలే.

మూ: అయితే, అబద్ధం చెప్పానంటావ్ ...? ఇప్పుడే తేలుస్తాను. ఏరేయ్ ... గోపీ ...

గో: (దూరంనుంచి) ఆఁ ... వొస్తున్నా ...

రెం: కథ చాలా వుందే ...?

మూ: గోపీ ... ఆమె యెవర్రా ...? మనవాడి రూంలో ఉంది ...?

గో: మీకింకా తెలియదా? అయితే, చంద్రం చెప్పలేదూ? ...

మూడు: మెరకవీధి భామకి - చంద్రం చెప్పేదేఁవిటోయి ? ... నీకు తెలిస్తే నువ్వు చెప్పరాదూ ? ...

గో: మీరందరూ అతనికి స్నేహితులై ఉండీ - యిలాగ మాటాడడం సబబుగా లేదు.

ఒకరు: అప్పను మరి. భోగందాన్ని తెచ్చి యింట్లో పెడితే, అది సబబు, అదేఁవిటి, దాని కథా కమామీష్ యేమిటంటే - అది బేసబబు. ఇంతకీ నీకూ ...

రెండు: ముసుగులో గుద్దులాట ఎందుకు ? చంద్రాన్ని పిలిచే అడగండి.

మూడు: ఏరేయి, చంద్రం ... ... చంద్రం ...

(దూరాన్నుంచి)

చం: రా, శాంతా ! నా మిత్రులతో మాటాడుదాం.

శాం: వొద్దు. నన్నెరిగినవాళ్ళు ఉంటారు. వాళ్ళందరి యెదటికి నేను రాలేను. మీరు నాకు కొత్త జీవితాన్ని యిచ్చారు. నా కదే చాలు. ఈ నాగరికతలూ, మర్యాదలూ వొద్దు. మీరు చాలు నాకు.

చం: అబ్బా! నన్ను చంపకు రా.

శాం: వొద్దు. వాళ్ళు యెగతాళిగా, మర్మంగా అంటే - యెంతో బాధపడాలి. వొద్దు.

(చంద్రం, చంద్రం అని పిలుపులు)

చం: తప్పకుండా రావలసిందే.

శాం: తప్పదా...?

చం: తప్పదు పద...

* * *

ఒకరు: పిట్ట కుదిమట్టంగా బాగానే ఉందోయ్.

రెండు: తమాయించు. తన్నేయకు మరి.

మూడు: నోర్మూయ్యండిరా. రావోయ్ చంద్రం. వారెవరు... ఓహో... శాంత...

చం: అవును. ఆమె పేరు శాంత. ఆమె పతిత. అందుకు బాధ్యత సంఘానిదే. పంకంలోనుంచి పద్మం పుడుతుంది. అవినీతి జీవనంనించికూడా నూతన జీవనం ఉద్భవిస్తుంది. అందుకు తార్కాణం శాంత. ఆమెని ఉన్నత స్థితికి తేవాలని ప్రయత్నిస్తున్నా. అందుకు నాకు మీ అందరి సహాయం కావాలి.

మూడు: భేషుగ్గా! తప్పకుండా!

చం: సంతోషం. శాంత యిప్పుడు చదువుతోంది.
ఒకరు: చదువు పూర్తయితేకాని పెళ్ళి చేసుకోవా...?
చం: (తటపటాయించి – ఛప్పున) ఆ ప్రశ్న లేదు. ఇప్పుడు కేవలం, ఆమె అభివృద్ధికోసమే ప్రయత్నిస్తున్నాను.
రెండు: అదీ మంచిదేలే. నీ సాహసం మెచ్చతగింది. కాలమాన పరిస్థితులు బాగుంటే నువ్వో నాయకుడివి కావచ్చు.
చం: మళ్ళా వస్తాం. అవతల యింకా మిత్రుల్ని పలకరించాలి, వొస్తా...
మూడు: చూశార్రా... మనవాడి వెర్రి !
ఒకరు: ఇంకా రెండురోజు లుంటుందీ వెర్రి. అంతే.
రెండు: ఒరేయ్, నిన్ను గుర్తుపట్టేండిరా.
మూడు: (వికటంగా నవ్వి) వొరేయి, ఆడదానికళ్ళు చేపకళ్ళతో పోల్చార్రా పెద్దలు. మరిచిపోవడం కలలోవార్త. పోదాం పదండిరా ! మాస్టా రొస్తున్నాడురోయ్...
మాస్టా: లేస్తున్నారేం...?
మూడు: ఏం మాస్టారూ...? ఆలస్యమయింది...? శిష్యురాలిని యే కోర్సు చదివిస్తున్నారు...?
మాస్టా: నేను చాలించుకున్నాను.
రెండు: ఏం యెంచేత...?
మాస్టా: కుక్కతోక వంకరతీయడం యెలాంటిదో – ఇలాంటి వాళ్ళ మనస్సులు మార్చటం అలాంటిదే.

మూడు: అదా సంగతీ. మాస్టారూ మీరు ప్రవరాఖ్యులు కనక తప్పించుకున్నారు.

మాస్టా: అంతేనోయ్ – అంతే!

ఒకరు: అయితే, నాకు సందేహం వచ్చిందీ...

మాస్టా: వోరేయ్, నోర్ముయ్యండి. మన మాటలు వింటల్లే వుంది శాంత.

ఒకరు: ముందు లేచిపదండి. బయట మాటాడుకుందాం.

(ఫ్లాష్‌బాక్ ముగిసిన ధ్వనులు)

[కమల ఇంట్లో]

కమల: ఆ దరిద్రపు మాటలు నువ్వేనా, చంద్రంకూడా విన్నాడా...?

శాం: ఆఁ...విన్నాడు. దాంతోనే క్షయరోగి రోజురోజుకి చిక్కినట్టు, అనుమానాలతో అతను బాధపడ్డాడు. రాను రాను అతని చేతిలో డబ్బు అయిపోయింది. ఉద్యోగ ప్రయత్నాలు సాగలేదు.

కమ: వాటికి తోడు నీ మీద అనుమానాలు కూడా పెరిగాయా...?

శాం: ఎందుకు పెరగవు? అతని స్నేహితులంతా తరుచు వొచ్చేవాళ్లు. ఏవేవో వాగేవాళ్లు. వాళ్లని రానివ్వద్దని చెప్పాను. వినలేదు. నేను మాత్రం ఏం చెయ్యను...?

కమ: అదే నాగరికతలో వున్న రహస్యం.

శాం: నా మనసు పదేపదే గాయపడేది. ఒంటరిగా వెళ్ళే దాన్ని. తిరిగి పారిపోదామనుకునేదాన్ని. కాని, అతన్ని వదలి ఎలా జీవించగలను?...అని అనుకునేదాన్ని. ఎన్ని కష్టాలయినా ఓర్చి అతనితోనే జీవించుదామనుకున్నాను. కాని, ఎన్నాళ్ళు ఆ యమయాతన భరించడం—చివరకి నిన్నరాత్రి...

క: ఏం జరిగింది...? కొట్టాడా...?

శాం: కొట్టడం యిదివరకే జరిగింది. కాని రాత్రి...అతను తాగికూడా వొచ్చాడు.

(ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వని)

(చంద్రం గదిలో)

చం: ఏయ్...శాంతా

శాం: ఆఁ...

చం: మాస్టారు వొచ్చాడా...?

శాం: ఎందుకొస్తాడు...?

చం: ఎందుకా...? నీ కోసం!... రాలేదా...?

శాం: ఎందుకలా అంటున్నారు — చెప్పరూ... ? ఏఁవిటీ మాటలు... ?

చం: మాటలు కాదు, పరమసత్యాలు. నిన్ను బురదలోంచి తెచ్చాను. కాని, పద్మానికి బదులు—పాము నత్తగుల్లవయ్యావు.

శాం: ఏంమాటలు...? మీరేనా యిలా మాటాడవలసింది? నే నేపాపం ఎరగను. నన్ను నమ్మరూ...?

చం: నమ్మాన్నేభామా, నమ్మాను. నమ్మి నా స్థితి యింతకి దిగజారింది. నలుగురిలో నగుబాటయింది. కన్నవాళ్ళు డబ్బు పంపడం మానేశారు. చదువు చెడింది. సంఘంలో మర్యాదపోయింది. ఇవన్నీ పోయినా నువ్వున్నా వను కున్నాను.

శాం: చెప్పండీ, నే నేమయ్యాను? (యేడుస్తూ) నే నేంకాలేదు. మీ పాదాలవద్దే ఉన్నాను. నామాట నమ్మండి.

చం: ఇక్కడే వుండి—నాటకం సాగిస్తున్నావు.

శాం: ఛి ఛీ !...అలాంటిది అనుకోకండి. నా అణువణువూ మీకోసం అర్పిస్తాను. నేనేమీ ఎరగను. ఏవో అపవా దులు వినివుంటారు.

చం: అపవాదులా...? నీకు కొత్తేముంది? పాతజీవితాన్నే యిక్కడా ప్రారంభించావు...

శాం: అబద్ధం. నన్ను నరికినా భరిస్తాను. కాని అభాండం వెయ్యకండి. నేను...మీ పాదాలసాక్షిగా...నా సమ స్తాన్నీ మీ కర్పించాను.

చం: అర్పించావు...ఆ మాస్టారుకీ...

శాం: ఛీ! అలాంటిమాట లనకండీ, మీకు పుణ్యంవుంటుంది. అతనే నన్ను బలవంతం చెయ్యబోతే, మెదిరించాను.

చం: నాతో యెందుకు చెప్ప లేదు...?

శాం: చెప్పకపోవడం పొరబాటని అనుకోలేదు. క్షమించండి.

చం: అదే అసలు రహస్యం. సరే, జరిగిందేదో జరిగింది... ... యిక నీకూ నాకూ కుదరదు.

శాం: అదేఁవిటి? నన్నొదిలేస్తారా ...?

చం: హో... నేను వదిలేదేముంది ? నువ్వు తిరిగి పాతకొంపకే చేరతావు. హాయిగా ఉంటావు. కాని, నాకేం గతి ఉంది ? సంఘం – మర్యాదా అన్నీ కోల్పోయాను.

శాం: వొద్దు – అలా అనకండి. నన్ను నమ్మరూ ...

చం: లేదు – నమ్మను – నమ్మలేను.

శాం: (నిట్టూర్చి) నమ్మరు ! ఎందుకు నమ్ముతారు ...? మీరు మగవారు—నేను ఆడదాన్ని.

చం: ఆడదానివి కనకనే బ్రతగ్గలవు.

శాం: నన్ను నమ్మించి యీ కొత్తజీవితంలోకి మళ్ళించారు. నా అణువణువునా మిమ్మల్ని ప్రేమించాను. అలానే జీవించాను. ఆడది హృదయం యిస్తే, తిరిగి తీసుకోలేదు. అది చేతకాదు. ఆ దౌర్బల్యంవల్లనే మీరు నాకింత శిక్ష విధించగలుగుతున్నారు. ఆనాడు మీ కళ్ళు మూసుకుపోయి, నన్ను తెచ్చారు. ఇలాగే వేధించి, నన్ను జీవచ్ఛవాన్నిచేసి తరుముతున్నారు. ఇదేనా న్యాయం ...?

చం: అధిక ప్రసంగం అనవసరం.

శాం: నీలాంటి పిరికిపందలకీ, ఉత్తర కుమారులికీ అనవసరం. నిజమే ! ఇదేగా నన్ను ఉద్ధరించే విధానం ? కీర్తికోసం నన్ను తెచ్చి సంఘంలో జూదమాడాలనుకున్నావు. ఆటలో గెలిస్తే కీర్తి దక్కేది; నన్ను దక్కించుకునే వాడివి. దురదృష్టవశాత్తూ వోడిపోయావ్. అందుకే

నన్ను తిరిగి తరుముతున్నావ్. ఆఖరుసారి నా ప్రార్థన వినవూ... నీ పాదాలవద్ద కాస్త చోటివ్వవూ? నీ హృదయం కరగడంలేదా...?

చం: లేకేం, అగ్నిపర్వతం పగులుతోంది.

శాం: పగలనీయ్... దాంతో, నువ్వూ నేనూ యేకంగానే నాశనమవుదాం.

చం: అక్కడకూడా నీ సాహచర్యం యెందుకు...? సిగ్గులేక...!

శాం: సరే, నీ వొక్కడివే సాధించు ఆ స్వర్గాన్ని. సెలవ్... గుర్తుంచుకో... ఆడదాని జీవితంతో మాత్రం ఇకముందైనా జూదమాడకు.

(ఫ్లాష్‌బాక్ ముగిసిన ధ్వనులు)

(కమల ఇంట్లో)

కమ: ఇదా ఆఖరికి జరిగింది...?

శాం: (ఏడుస్తూ) ఇదే నక్కా...?

కమ: ఛ! యేడవకు. జూదంలో పావులం ఆడవాళ్ళం, అంతే!

(దూరంనుంచి గుడిగంటల మధ్య)

"ఓం అసతో మా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

కమ: ఏ దబద్ధం? ఏది చీకటి...? యేది మృత్యువు? అంతా అబద్ధం. ఒక్కటే పరమసత్యం. ఈ ఆడదాన్ని సహస్ర విధాల అణచి, అనుభవించి, ఆనందించి, నిష్ప్రయోజకి

తోసేస్తారు ... నీళ్ళు పోస్తారు. అంతే! అది సృష్టిధర్మంగా చెలామణీ అవుతోంది.

శాం: ఇంకేం గతిలేదా, అక్కా ...?

క: లేకేం చెల్లీ! ఆడది అమృతభాండం కాగలదు. అగ్ని పర్వతం కాగలదు. పద! ... ఆవేశాలు నిగ్రహించుకుంటే ఆడది బ్రతకగలదు. లేదా, మనకి మనమే మృత్యుముఖా లవుతాం.

చంద్రం: (బయటనించి) శాంతా! శాంతా!!

శాం: తలుపు తీయకు అక్కా! ... యిక అతని ముఖం చూడలేను.

క: సరే.

చం: శాంతా! శాంతా!!

(అని పిలుస్తూంటే ఫేడవుట్.)

---

శ్రవ్య నాటిక

# నౌకాభంగం

(సముద్రతీరాన చిన్న బస్తీ, వొడ్డునే శశిబాబు మేడ: పై భాగంలో పుస్తకాల గది. శశిబాబు చదువుకుంటున్నాడు. సముద్రంనుంచి, వివిధ మధుర సంగీతాలు వినిపిస్తుంటాయ్. సంధ్య వొచ్చింది, కాని శశిని చూడలేదు....)

సంధ్య: రామ్‌దాస్ — (పిలుస్తో) రామ్‌దాస్ ... ఎవరో ఈ పుస్తకాలన్నీ చిందరవందరగా పడేశారు. రామ్‌దాస్! రాం ...

శశి: (నెమ్మదిగా) — రామ్‌దాస్ ... ఇప్పుడే దిగి వెళ్ళాడు, సంధ్యా !

సంధ్య: (ఆకస్మికంగా)—ఓహ్ ...

శశి: అతను తిరిగి ఇప్పుడే వస్తాడు ...

సంధ్య: (మృదువుగా) — మీరున్నారని అనుకోలేదు, శశిబాబు !

శశి: భయంలేదు. (నవ్వుతో) నే నేమీ పెద్దపులిని కాను ...

సంధ్య: నేనూ మేకపిల్లను కానులెండి ... (ఇద్దరూ నవ్వుతారు) పాపం, నా మూలాన మీ సరస్వతీపూజ భగ్నం కాలేదు కదా !

శశి: పూజ చెడినా పుణ్యం ఎక్కడికి పోతుంది ?

సంధ్య: ఎక్కడికీపోదు — ఇదంతా మీపుణ్యమేగా! ... బండెడు పుస్తకాలు పడి ఉన్నాయి. ఇవన్నీ సర్దేసరికి ...

శశి: అవన్నీ రాందాస్ వొచ్చాక సర్దుతాడుకదా, నీ కెందుకా శ్రమంతా సంధ్యా ?

సంధ్య: ఇదికూడా ఒక శ్రమేనా, శశిబాబూ! ఈ పుస్తకాలన్నీ ఇలా సర్దుతోంటే నాకెంతో సంతృప్తిగా ఉంటుంది. ఇట్టి దేవతల్ని ఆరాధిస్తే భక్తులు విసుక్కుంటారా ?

శశి: చిత్రమైన భక్తుల్ని సంపాదించుకున్నాయి పుస్తకాలు... కాని—నే నేమనుకుంటూంటానో తెలుసా, సంధ్యా ?

సంధ్య: నాకేం తెలుస్తుంది ? చెప్పండి వింటాను.

శశి: కొన్నాళ్ళకయినా—ఈ పుస్తకాలు సర్దడానికి ఎవరుంటారా అని ?

సంధ్య: ఏమిటి మీారనేది?

శశి: రేపో మాపో నీవు అత్తవారింటికి వెళ్ళిపోతే...

సంధ్య: పోదురూ ... (దూరం) మీాతో కబుర్లాడుతూ కూచుంటే ఈ పుస్తకాలన్నీ ఎప్పుడు సర్దడం ?... చూడండి ...శశిబాబూ! ఈ పుస్తకాలనుంచి జీవితం శోభిస్తుందంటారా?

శశి: ఆఁ చాలవరకు ...పూర్తిగా అనిమాత్రం అనలేను... చాలామంది మనుషులు కల్పించలేని నూత్న జీవితాన్ని ఈ పుస్తకాలు ప్రసాదిస్తాయని నమ్ముతారు, సంధ్యా !

సంధ్య: తథాస్తు...

(ఇంతవరకూ సంధ్య పుస్తకాలు సర్దుతో దూరంగా ఉంది. ఇప్పుడు దగ్గరకు వచ్చి కూర్చుంది)

సంధ్య: (ఆదుర్దాగా) అదేఁవిటి, అలా ఉన్నారు ?
శశి: ఎలా ఉన్నాను ? ముఖ్యం, మొగం సరిగా లేదా ?
సంధ్య: ఎగతాళి చేయకండి, శశిబాబూ ! కళ్ళన్నీ ఎఱ్ఱబడి జ్యోతుల్లా ఉన్నాయి. అంతా నలిగి...
శశి: ఏఁవిటా కంగారు సంధ్యా ? రాత్రి సరిగా నిద్రపట్టలేదు. అంతే !
సంధ్య: కాదు... నిజం చెప్పండి...
శశి: నిజం చెబితే నమ్మడంలేదు... కావాలని అబద్ధం చెప్పనా?
సంధ్య: నేను నమ్మను. రాత్రి తెల్లవార్లూ చదువుతూ కూచున్నారు, కాబోలు!... ఇలా రాత్రిళ్ళకి రాత్రిళ్ళు జాగరణలు సాగిస్తే ఆరోగ్యం చెడిపోదా, శశిబాబూ!
శశి: నన్ను గురించి నీకింత ఆందోళన ఎందుకు సంధ్యా...
సంధ్య: ఇలాంటి ప్రశ్నలకి జవాబులు ఉండవు... నా లాంటి దౌర్భాగ్యురాలి జవాబు ఏఁవంత బాగుండదుకూడా...
శశి: (నిమురుతో—ప్రేమతో) నువ్వు దౌర్భాగ్యురాలివా, సంధ్యా! కాదు. నిర్మల సాగరం నీ హృదయం; నిందించుకోకు. నీవు ఉత్తమ జీవితాన్ని అనుభవించాలనే నా కోరిక...

(శశిబాబు మాటలు ముగియకముందే రామ్‌దాస్ మూరాన్నుంచి పెద్దగా మాటాడుతో వొస్తాడు)

రామ్: ఓ, హో, హో! ఇలాగనకయితే ఏనాడో ఈ మేడ కాస్తా తీసి నడి సముద్రంలో కట్టుకోనవలసి వొచ్చేది...
శశి: (గట్టిగా) రామ్‌దాస్ !

రామ్: (దగ్గరగా) బాబూ!

శశి: ఏఁవిటా అడావిడి ?

రామ్: బాబుగారు క్షమించాలి. ఆ పెద్దమ్మగారితో బతికే రోజులు గాదండీ...

సంధ్య: మా అమ్మేనా ?

రామ్: అవును, బుల్లెమ్మగారూ! మీ రేమన్నా అనుకోండి! ఏం లాభంలేదు.

శశి: ఏఁవిటి నీ ముఖం. విషయం చెప్పు...

రామ్: నేను బుద్ధిపూర్వకంగా ఏదన్నా తప్పు చేస్తే—ఆ పార్వతమ్మగారు దండించినా పడతాను—ఊరికే... రామ రామ...

సంధ్య: ఇప్పుడేం జరిగింది రామ్‌దాస్ ?

రామ్: బాబుగారు బజారుకి వెళ్ళి రమ్మంటే, వెళ్ళి—వొస్తూ మేడ మెట్లపక్కనే మీ అమ్మగారు మడిబట్టలు ఆరేసిన సంగతి చూశానా ? పెట్టానా ? నా దోవని నేను తలొంచుకొస్తూంటే—గాలికే ఎగిరిందో, ధూళికే ఎగిరిందో—ఎగిరొచ్చి ఆ బట్ట కాస్తా నాకు తగిలింది...

సంధ్య: గాలికి కాకపోతే కావాలని అంటుకుంటా రేమిట్లే ?

రామ్: నిజం బుల్లెమ్మగారు... అప్పుడే నూతివద్దనుంచి వొస్తున్నారు పార్వతమ్మగారు... ఆ బిందె కాస్తా కూలేసి— మంగళవారం పొద్దుటిపూట మడిబట్ట కాస్తా తగలేశావ్, అంటూ ఒకటే సాదింపు మొదలెట్టారు...

శశి: అంత కళ్ళుమూసుకుని రాకపోతే—కాస్త ముందూ వెనకా చూసి రాకూడదూ!

రామ్: మీరు కూడా అలాగంటా రేఁవిటి, బాబూ!

సంధ్య: ఇందులో అతని తప్పేముంది, శశిబాబూ!

శశి: ఎవరి ఆచారాలు వారికి గొప్ప...ఎదటి వారిని మన్నించడం మనకి ధర్మం కదా...

రామ్: అలగావాణ్ణనీ ఏమేమిటో ఒకటే సాధింపయితే యెలాగో మరి? ఇన్నేళ్ళ నుంచీ నేనూ మా బాబుగారి నోట మాట పడలేదు—

సంధ్య: మమ్మల్ని గురించి మీ రెన్ని బాధలు పడుతున్నారు?

శశి: వృథాగా ఎందుకు బాధపడతావ్! సంధ్యా!

సంధ్య: వృథాగా కాదు, నిజంగానే—ఈ యేడాది నుంచీ మీ ఆశ్రయంలో ఉంటూ కూడా చీటికి మాటికి మిమ్మల్ని వేధిస్తున్నాం.

శశి: ఒకరి ఆశ్రయంలో బ్రతుకుతున్నామని చెప్పుకోడానికి సిగ్గేయడం లేదూ, సంధ్యా!

సంధ్య: నిజం చెప్పుకోనేందుకు సిగ్గు, భయమూ ఎందుకు? కృతజ్ఞతాపూర్వకంగా మరోసారి చెప్పడానికికూడా సిగ్గు పడవలసిన పని లేదు, శశిబాబూ...

శశి: (ఛీత్కారంగానే) సంధ్యా! నీ విప్పుడు దిగి వెళ్ళు—మరోసారి చెప్పకుండువుగాని—

సంధ్య: వెళ్లుతున్నాను.

రామ్: బుల్లెమ్మగారి కోపం హెచ్చింది, బాబూ !

శశి: (పిలుస్తూ) సంధ్యా ! వెళ్ళకు. ఇలా రా...

సంధ్య: (దూరంనుంచి) నేను రాను.

శశి: ఒక్కమాట...

సంధ్య: మాటలకోసం మాటి మాటికీ మెట్లెక్కి దిగలేను... (మరింత దూరంగా) వెళ్ళి పోతున్నాను...

శశి: (నిట్టూర్చి) రామ్‌దాస్...

రామ్: బాబూ...

శశి: నీవు మాటి మాటికీ పార్వతమ్మగారితో జగడం పెట్టుకుంటే ఎలాగ ?

రామ్: నే నేం చేయలేదు బాబూ ? కదిలినా మెదిలినా ఆవిడకి తగని కోపం, అంతూ పంతూ లేని అంటు సొంటులు...

శశి: నువ్వు సంధ్యను చూసి ఐనా—పార్వతమ్మ గారితో ఎప్పుడూ జోక్యం కలిగించుకోకు; తెలిసిందా...?

రామ్: బుల్లెమ్మగారు దేవతామూర్తి కనకనే - ఊరుకుంటూన్నది. ఆ పార్వతమ్మగారు ఇక్కడ ఓ నిమిషం ఇమిడేమనిషేనా ?

రామారావు: (దూరంనించి) శశిబాబూ! శశిబాబూ!!

శశి: ఎవరు ? రామారావా ? రావోయ్...

రామా: అభ్యంతరా లేమన్నా ఉన్నాయేమోనని సంశయిస్తున్నాను.

శశి: ఏమిటా లేవే... రెండేళ్ళనుంచీ ఇటు రావడమే మానే శావ్? అందరూ కులాసా?

రామా: ఏదీ రావడానికి తీరిక? దేశం ఆ మూలనించి ఈ మూలకి ఒకటే తిరుగుడు.

శశి: అసలు మనిషివే తిరుగుడు మనిషివి. ఇక దేశంలో తిరగ డానికి నీ కభ్యంతర మేముంది?

రామా: కబుర్లకేం గాని—మన భోజనం స్వయం పాకమా? అన్నపూర్ణాదేవి భిక్షా?

శశి: అంటే (నవ్వు)

రామా: అనుమానం వొచ్చిందిలే.

శశి: రామ్‌దాస్...

రామ్: బాబూ...

శశి: కాఫీ పట్టుకురా...

రామ్: అలాగే బాబూ...

రామా: ఇంతకీ నాకు జవాబు చెప్పావుకావు.

శశి: నీ కెందుకు కలింగిదా అనుమానం?

రామా: ఎందుక్కలగదు? కిందటిసారి వొచ్చినప్పుడు—నీవో నారాయణా—అంటూ ఒక్కడివి—నీకు తోడు ఆ రామ్‌దాస్—ఇంతేగా?

శశి: ఇప్పుడు మాత్రం అంతగాక...

రామా: ఎందు కీ స్వస్తి? ఇందాక మేడమెట్లు ఎక్కుతూ చూశాను.

శశి: (నవ్వి) ఎవరిని ?

రామా: నన్నూరికే వేధించకు శశిబాబూ ఎవరు వారు ?

శశి: వారిది మా వూరే...

రామా: ఏదో బాదరాయణ సంబంధమందూ. కనీసం ఓ శుభలేఖయినా వ్రాయకూడదోయ్...

శశి: (నవ్వుతో) బాగా బోల్తా పడుతున్నావ్ సుమా ?

రామా: నీ చలవ – ఢింకీలు కొట్టిస్తున్నావ్...

శశి: వారిది చాలా గొడవవుందిలే...

రామా: ఏదో గొడవ లేకపోతే ఇక్కడెందుకుంటారులే అదే చెప్పు...

రామ్: ఇదుగో బాబూ కాఫీ.

శశి: ముందు కాఫీ తీసుకో రామూ? తర్వాత వినదువుగాని—

రామా: నీ మాటలు వినడానికి కాఫీ అడ్డురాదులే—చెప్పు...

శశి: ఆ కుటుంబానిది మా ఊరే. గడిచీ గడవని సంసారం కన్నకూతురికి పెళ్ళి చేయలేనందుకు తండ్రి దిగులుపడి—సంసారాన్నొదిలి బైరాగుల్లో కలిసిపోయాడు.

రామా: అరే...పాపం...

శశి: ఇక ఆవూళ్ళో తలెత్తుకుని బ్రతకలేక—భర్త బైరాగుల్లో కలిసిపోగానే పార్వతమ్మగారు కూతుర్ని తీసుకుని...

రామా: ఆమె పేరేమిటి ?

శశి: సంధ్య. ఇద్దరూ కలిసి ఇక్కడికి వొచ్చారు.

రామా: ఎన్నాళ్ళయింది వొచ్చి ?

శశి: దాదాపు ఏడాది కావచ్చింది. గర్భ దరిద్రంలో మునిగి పిల్లకి పెళ్ళి చెయ్యనందుకు ఊరివారు కాకుల్లాగా పొడిచి గద్దల్లాగ తన్ని తే—భరించలేక తండ్రి వొదిలి వెళ్ళి పోయాడు ...

రామా: సంధ్యకి పెళ్ళి కాకపోవడానికి వేరే కారణా లున్నాయా?

శశి: ఏ ముండాలి? పల్లెటూళ్ళల్లో పొట్ట గడవడమే దుర్భర మైన కుటుంబాల్లో కట్నం లేకుండా గడ తేరిన పిల్లని ఎవరు పెళ్ళిచేసుకుంటూరు, రామూ! ఇంతేగాక నింద ల్లోనూ అపవాదుల్లోనూ వాళ్ళ ప్రాణాల్ని తీసేస్తారు ...

రామా: ఇదా సంగతి? ... మరేవిటి గత్యంతరం?

శశి: పార్వతమ్మగారు సదాచార పారాయణి. విధికేదుగీ దయినా సరే — మూడు ముళ్ళూ వేయించి ఎక్కడికో తనదోవ తాను చూసుకుందామని ...

రామ: ఇక్కడికెందుకు వొచ్చారు?

శశి: నేను మావూళ్ళో చిన్నతనంలో వున్నప్పుడు పరిచయం. మా పొరుగిల్లే వీరిది—ఏట్లో మునిగిపోయేవాళ్ళకి గడ్డి పోచే ఆధారమన్నట్లు—ఆ కాస్త పరిచయమే ఆధార మయింది ...

రామ: చాల చిత్రమైన సమ్మేళనం. అంత సదాచార సంపన్ను రాలయిన పార్వతమ్మగారికి—నీ ఆశ్రయంలో—కేవలం నీతో కలిసి ఉండటం ఇష్టమేనా?

శశి: కాదు—నాకు కులంలేదనీ, గోత్రం లేదనీ—అన్నీ ఏకం చేసినవాణ్ణనీ తెలుసు. జాతి భ్రష్టుణ్నే—కాని పార్వతమ్మ మాత్రం ఏంచేస్తుంది? కూతురు పెళ్ళయినా చేయాలి. లేకపోతే సముద్రంలో పడి చావాలి. అంతేగా...

రాము: సంధ్యకి చదువు సంధ్యలున్నాయా?...

శశి: సంధ్య విషయంలో వేరే చెప్పనక్కర్లేదు. ఆమె ఎంత లావణ్యవతియో — అంత ఉన్నతమైన హృదయం. ఉత్తమ భావ సంపదా ఉన్నాయి. ఆమె సంస్కారం కూడా శక్తివంతమైనదే...

రామ: ఇన్ని ఉత్తమ గుణాలున్నాక కూడా... నీవు...

శశి: ఏమిటి?

రామ: నువ్వు ఉపేక్ష చేస్తున్నావా శశిబాబూ?...

శశి: ఏం చెయ్యమంటావు. రామూ!

రామ: నీవే ఆమెని పెళ్ళి చేసుకోరాదూ?

శశి: పిచ్చి రామూ... నాలాంటి కుల గోత్రాలు లేనివాడికి పిల్లనిచ్చి... నీ వింకా లోకంనుంచి చాలా విషయాలు తెలుసుకోవలసి వుంది... పద రామూ... వరండాలోకి.

రాము: అంతా అయోమయంగా ఉంది శశిబాబూ...

శశి: పద—నీ ప్రశ్నకి జవాబును గురించే చాల రోజుల్నుంచి ఆలోచిస్తున్నాను. కల్లోలిత సముద్రాలు మన జీవితాలు... మన దారులు ఏనాడో మాసి పోయాయి.

(నిష్క్రమణ)

# రెండు

(వాతావరణం చిరాకుగా ఉన్నది. పార్వతి....సంధ్య)

పార్వతి: ఓయ్ సంధ్యా ఎక్కడున్నావే?

సంధ్య: (దూరంలో) ఇక్కడే ఉన్నానమ్మా.

పార్వతి: ఇలా రా ఏం చేస్తున్నావ్ ?

సంధ్య: వొస్తున్నా...

పార్వతి: ఆ చేతులో దేమిటి?

సంధ్య: అల్లిక దారమమ్మా...

పార్వతి: ఇదంతా ఆ శశిబాబుదేనా?

సంధ్య: అవునమ్మా...

పార్వతి: (చమత్కారంగా) — అవు నమ్మా... ఎంత రాగంతో చెబుతున్నావే తల్లీ? ఇదంతా నా చావుకి వొచ్చింది. ఆ ఊళ్ళో నిందలు మోసీ మోసి ఇక్కడ ఈ చాస్రుల్లో చచ్చీ—చచ్చీ—

సంధ్య: ఎందుకమ్మా అలా గోలచేస్తావ్ ?

పార్వతి: నాదంతా గోలగానే వుంటుంది రాణీగారికి—మాటి మాటికీ ఈ అలగా జనంతో జపాలు తపాలు పాడవు తున్నాయి. నీతో నా పరువే పోతుంది...

సంధ్య: మనకి ఆశ్రయమిచ్చి ఆదరించిన వారిని గురించేనా ఈ శాపాలు?

పార్వతి: నేను శాపాలు పెడుతున్నానటే పిల్లా? ఓయ్ దేవా ఇంత సముద్రం ఉంది నన్నలా ఎత్తుకు పోగూడదూ...

సంధ్య: (దుఃఖం, కోపం) ఇంతలో కొంపేం మునిగిందమ్మా ఈ ఏమ్పులూ మొత్తుకోళ్ళూ...

పార్వతి: సంధ్యా! నేను నీకుమల్లే చదువులు నేర్చినదాన్ని కాకపోయినా నలుగురి మొఖాలు చూసిందాన్నే—ఆ శశిబాబుతో పొద్దస్తమానం చదువు లేమిటే?

సంధ్య: అమ్మా ఎవర్ని గురించి నువ్వనేది?

పార్వతి: నలుగురూ ఏమనుకుంటారో అనుకోవద్దటే—శశిబాబు తండ్రిడిది మన కులమే అయినా—తల్లి కులం లేనిదే...అందుకే వూళ్ళోవాళ్ళు ఇతన్ని వెలేశారు. డబ్బుంది కనక ఇక్కడికి వచ్చి ఉంటున్నాడు.

సంధ్య: అమ్మా! ఎందుకు చెబుతున్నావో అర్థం కావడం లేదు. తల్లి దోషానికి శశిబాబు దోషం ఏముంది. నాకు పెళ్ళి చేయకపోతే నాన్న బైరాగుల్లో కలిసేదాకా హింసించిన మన ఊరి వాళ్ళకన్నా—శశిబాబు గొప్పవాడు; కులం గలవాడు. ఈ ఏడాదినుంచీ జోలి గట్టుకుని శశిబాబు పంచని పడివుంటే మనకు కులం పోలేదా అమ్మా...

పార్వతి: ఓసి నీ నోరు పడ. గుట్టుగా బతికి—మనదోవని మనం పోతాం గాని నానా మాలకూళ్ళు తిని కులం పోగొట్టుకుంటామా? ఇంతకీ నాఖర్మ...నీ మూలాన...

సంధ్య: అమ్మా, పదే పదే కులమని ఎదటివాళ్ళని హింసిస్తూ కూచుంటే—నువ్వు నమ్మిన భగవంతుడు కూడా నిన్ను క్షమించలేడు. ఈ లోకులకన్నా—నాన్ననీ—నిన్నూ

కాపాడే కుల గోత్రాలకన్నా, శశిబాబు వెయ్యిరెట్లు గొప్పవాడు. అందరూ కలిసి మన ముఖాలమీద బురద పులిమితే—కులగోత్రాల్లేని ఈ శశిబాబే ఆశ్రయమిచ్చి ఆదుకున్నాడు. నీవు కనక మాటి మాటికి—అన్నావా — ఆ సముద్రమే గతి...

పార్వతి: అయ్యో తల్లీ! ఆ మూడు ముళ్ళూ పడితే—నాకీ చెర తప్పుతుంది.

సంధ్య: ఈ పెళ్ళికోసమే—నాన్న వెళ్ళిపోయారు—ఇక—(ఏడుస్తుంది.)

## మూడు

(కొన్నాళ్ళు గడిచాక పార్వతి, శశిబాబు, రామ్‌దాస్)

శశి: పార్వతమ్మగారూ నన్నూరికే పొగడకండి. మీ కుటుంబానికీ, మాకూ ఉన్న ప్రేమ బాంధవ్యం వల్ల కలిసి ఉండడం జరిగింది. అందుకు ఇంత ప్రస్తావన ఎందుకు?

పార్వతి: లోకులెన్నైనా చెప్పుకుంటారు నాయనా? వాళ్ళకేం పిల్లదాని పెళ్ళి విషయంలో దాని తండ్రిని ఎన్ని ఆడి పోసుకున్నారో ఆ భగవంతుడికే తెలియాలి.

శశి: పోనీయండి. జరిగిపోయిన విషయాల్ని మళ్ళా తవ్వుకోవటం ఎందుకు? మల్లవరం సంగతి చెప్పొచ్చారు...

పార్వతి: మతిమరపుదాన్ని... ...మల్లవరం వెళ్ళి చయనులు గారిని చూసొచ్చాను, నాయనా! నేను బతికున్నందుకు

ఎల్లాగోల్లాగా సలక్షణంగా దాని మెళ్ళో ఆ మూడు ముళ్ళూ పడితే—నా దోవ నేను చూసుకుంటాను.

రామ్‌దాస్: పార్వతమ్మగారూ ఆయన కెన్నేళ్ళుంటాయి ?

పార్వతి: ఎన్నుంటయ్‌లే, చూపులకి కాస్త పెద్దతరహా మనిషిగా కనిపించాడనుకో—(శశిబాబుతో)...నువ్వేరగం దేమున్నది శశిబాబూ, మన సంధ్యమాత్రం చిన్నదీ చితకదీ కాదుగా ఇంకెన్నాళ్ళు వేచిఉంటాం ?

శశి: చయనులుగారి కేమన్నా పిల్లలా ?

పార్వతి: మొదటి రెండు సంబంధాలకి నలుగురు పిల్లలు. అయితేనేం—కాస్తో కూస్తో సంసారం జరగడానికి ఆస్తి వుంది. పిల్ల సుఖపడుతుందని ఆశ నాయనా...

రామ్‌దాస్: మా గొప్ప సుఖమండీ పార్వతమ్మగారూ...

పార్వతి: మా తిప్పలు మీ బోటివాళ్ళకేం తెలుస్తాయ్ రాందాసూ. (శశిబాబుతో) శశిబాబూ ! చయనులు గారికి ఖాయం అని వచ్చాను.

శశి: (దెబ్బతిని సంబాళించుకున్నాడు) సంధ్యతో చెప్పారా ?

పార్వతి: ఎందుకు నాయనా ! నిక్షేపంగా యాభయ్యో పడ్డా తేనేం—చయనులు మగ మహారాజు...

రామ్‌దాస్: బుల్లెమ్మగారితో చెప్పనే లేదండీ ?

శశి: సంధ్య అభిప్రాయంకూడా తెలుసుకోండి పార్వతమ్మగారూ...

పార్వతి: అయిన కులంలో వొచ్చిన సంబంధాలకు **సంధ్యని** అడగడ మెందుకు నాయనా. నీ చలవవల్ల ఈ యేడాది

నీ పంచని 'ఆశ్రయమిచ్చావు. ఏదో మంచి లగ్నంచూసి ఆ మూడు ముళ్ళూ పడితే—నీ పేరుమీద నా కీ చెర తప్పేతుంది. ఇంక పిల్లని అట్టే పెట్టుకున్నా—చుంటే లోకం క్షమించదు బాబూ...(కొన్ని సెకండ్లు విషాదవాద్యం)

సంధ్య: (ప్రవేశిస్తుంది).

శశి: ఎవరు ?

సంధ్య: సంధ్యని...

శశి: సంధ్యవా ? చీకటి రెక్కలు విప్పుకుని నీల సముద్రాన్ని గొంతు నులిమేస్తుంటే—సముద్రం ఘోషిస్తోంది. సరిగ్గా ఈ సమయంలోనే వొచ్చావు—ఎందుకు సంధ్యా...

సంధ్య: తగిన వేళలోనే వొచ్చాను శశిబాబూ. (ప్రవేశిస్తుంది)

శశి: ఈ చీకట్లో — వొంటరిగా — భయం వేయడంలేదా సంధ్యా...

సంధ్య: మిమ్మల్ని గురించి భయపడనా శశిబాబూ ! ఎవరి హృదయంలో ఆశ్రయం లభిస్తుందో—అక్కడే భయం వేస్తుందా ?

శశి: వొచ్చిన విషయం మరిచి పోతున్నావా ?

సంధ్య: లేదు. దుఃఖాన్నీ, బాధనీ మరిచి పోతారా... పెళ్ళి పేరుపెట్టి నన్నిలా చంపకపోతే, మీరే స్వయంగా కాళ్లూ చేతులూ కట్టి సముద్రంలో పారేయకూడదా ?

శశి: లోకం ధర్మం సమాజం—స్త్రీలు పెళ్ళిచేసుకోవాలని శాసిస్తున్నాయి. పెళ్ళి కాకపోతే, వారికి ముక్తి లేదు సంధ్యా...

సంధ్య: కుల గోత్రాల పేరుచెప్పి నన్ను వధ్యశిలమీద బంధించడానికి మీరుకూడా అంగీకరిస్తున్నారా ?

శశి: నా అంగీకారం విలువేముంది సంధ్యా !

సంధ్య: స్త్రీ—జీవితంలో ఒక్కరి అంగీకారాన్ని, ఆజ్ఞని మాత్రమే స్వీకరిస్తుంది. పెళ్ళంటే ఇదేనా ? పాడెకి నన్నుకూడా కట్టడమేనా లోకం విధించే శాసనాలు ?

శశి: నే నేం చెప్పగలను సంధ్యా, ఏనాడో నా తండ్రి చేసిన అపరాధానికి లోకం నన్ను శిక్షిస్తోంది. తెలుసుగదా నీకు ? విశాల సాగరాన్ని చెలియలి కట్ట అదుపుచేసినట్టే మనల్ని లోకం...

సంధ్య: (మధ్యలోనే త్రుంచి) శశిబాబూ ! లోకం ! లోకం అని చెప్పి మాయచేయకండి... నలుగురితో పాటేనా మీరూ మాటాడేది ? నన్ను శిక్షించడానికి మీరూ భాగం తీసుకుంటున్నారా ?

శశి: నా హృదయాన్ని చీల్చి చూడగలవా సంధ్యా ఒక్క మారు...

సంధ్య: నన్నిలానైనా బ్రతకనీయరా ?... (నిట్టూర్చి) మరి గత్యంతరం లేదా శశిబాబూ...

శశి: నే నేం చెప్పను ?

సంధ్య: మిమ్మల్ని శ్రమ పెట్టాను. క్షమించండి. (ఆవేశంతో) హృదయాన్నీ, విశ్వాసాల్నీ కోల్పోయి మీరుకూడా నన్ను తిరస్కరిస్తారని ఊహించలేక పోయాను. శశిబాబూ ! స్త్రీ తన జీవితాన్ని తానుగా నిర్ణయించుకో

దానికి హక్కు లేకుండా చేస్తున్నారు. మీరంతా ... ఎవరి హృదయంలో చోటు లభిస్తుందని ఆశించానో అక్కడే అగ్నిపర్వతం బద్దలైపోయింది. హృదయాన్నీ, విశ్వాశాన్నీ బలియిచ్చి భ్రమపడ్డాను—ఏం చెయ్యను? వెళ్ళమనేనా ఆజ్ఞ ... వెళ్ళిపోతున్నాను.

శశి: నేనూ వస్తున్నాను, సంధ్యా ...

సంధ్య: (దూరం) భయం తీరింది. శశిబాబూ మీరు రానక్కర్లేదు, వెళ్ళిపోతున్నాను.

శశి: సంధ్యా—

(విషాద గీతం)

(సంధ్య వివాహం జరిగిపోయి అత్తనారింటికి వెళ్ళి ఆరు నెలలు గడిచాయి.) శశిబాబు మేడలో డాక్టర్, రామ్‌దాస్, శశిబాబు....

శశి:—(దగ్గుతాడు-మూల్గుతాడు) - అబ్బా ...

డాక్టర్: గుండెల్లో నొప్పిగా ఉందా శశిబాబూ?

శశి: ఏమో నాకు తెలీదు ...

రామ్: (—నెమ్మదిగాను—దుఃఖంతోనూ)— డాక్టర్ బాబూ ఏమవుతుంది చెప్పండి.

డాక్టర్: ఇలా ఇవతలికి రా ... నిద్ర పట్టేట్టుంది ... రోగికి ప్రమాదం లేదు. కాని అతిజాగ్రత్తగా కాపాడాలి. నువ్వు తప్ప మరెవ్వరూ లేరా?

రామ్: డాక్టర్ బాబూ! నా ప్రాణాన్నయినా ధారపోస్తాను. ఈ బాబుని బ్రతికించండి.

డాక్టర్: ఎవరి ప్రాణాన్ని ధారపోసినా చేసేదేముంది? ఇదేదో వింత జబ్బుగా వుంది మరి... మందులు పనిచేయడంలేదు. ఈయన తాలూకు ఎవరేనా ఉంటే కబురుచేస్తే బాగుంటుంది.

రామ్: ఎవరూ లేరు. మా బాబుకి—డాక్టర్ బాబూ—నయం కాదా ?

డాక్టర్: అది నేనెలా చెప్పను? ఆయన దేనికీ జవాబుచెప్పరు. ఏదో తీరని మనోవేదన ఉన్నట్టుంది.

రామ్: అవును బాబూ అవును.

డాక్టర్: నీకు తెలుసునా ?

రామ్: తెలుసు. చిన్నతనంనుంచీ ఆయన్ని కనిపెట్టు కూర్చున్నాను. ఆమాత్రం తెలియదా డాక్టరుబాబూ... ఇంతకీ అదృష్టం లేకుండా పోయింది.

డాక్టర్: ఏఁవిటా విషయం?

రామ్: సంధ్యమ్మగారూ—మా బాబుగారూ ఎంతో ఇదిగా వుండేవారు. ఆమె పంచప్రాణాలు ఇక్కడనే వుండాయి. భగవంతుడి నిర్ణయం ఇలావుంది.

డాక్టర్: ఏమయింది ?

రామ్: ఆమె తల్లి పార్వతమ్మగారి పోరు పడలేక—సంధ్యమ్మ గారిని బలవంతాన ముసలాయనకిచ్చి పెళ్ళిచేశారు.

డాక్టర్: అదా విషయం? అందువల్లనే ఈయన మనస్సు వికలమై ఉండాలి...

రామ్: ఆఖరికి మా బాబుగారి ప్రాణాలికొచ్చింది—డాక్టర్ బాబూ తమ చలవ...

డాక్టర్: నేను చేయగలిగిందంతా చేస్తాను. మబ్బులు పడుతు న్నాయ్. ఏమాత్రం చల్లగాలి తగిలినా గాని చాలా ప్రమాదం చేస్తుంది. జాగ్రత్తగా కనిపెట్టిఉండు. ఈ మందు ఈ రాత్రి త్రాగించు. నేను వెళ్ళొస్తాను.

రామ్: అయ్యా అలానే...

## నాలుగు

(వర్షం వచ్చింది. రామదాసు మల్లవరం వెళ్ళి సంధ్యను తీసుకు వచ్చాడు. శశిబాబు మంచంమీద ఉన్నాడు. సంధ్య నిశ్శబ్దంగా ప్రవేశిం చింది. రామదాసు శశిబాబు మంచందగ్గరగా వచ్చి, వొంగి చూస్తాడు)

శశి: (మూల్గుతాడు)

రామ్: బాబూ బాధగా ఉందా...

శశి: లేదులే—ఆ కిటికీ తలుపు తీయ్...ఎందుకు నన్నిలా కట్టి పడేశారు...రామ్‌దాసూ తలుపుతీయ్...

రామ్: వర్షం వొస్తోంది బాబూ...

శశి: అన్నీ వొస్తాయి—రాని దొక్కటే...ఒక్కటే...తీయ్ తలుపు...

(వర్షమూ, విషాద వాద్యమూ ప్రారంభమై చివరివరకూ హెచ్చుతాయి)

రామ్: బుల్లెమ్మగా రొచ్చింది — బుల్లెమ్మగారు.

శశి: ఎవరు ?

సంధ్య: నేనే శశిబాబూ...

శశి: సంధ్యా వొచ్చావా?

సంధ్య: వొచ్చాను.

శశి: రాందాస్—దీపం తీసుకురా...

రాం: తెస్తాను బాబూ—

శశి: ఇంత వానలో—ఇప్పుడు—సంధ్యా—నిజం?

సంధ్య: (ఏడుస్తుంది)

రాం: (దీపం తెచ్చి) ఆఁ?

శశి: ఆఁ — ఇదేమి వేషం సంధ్యా? ముసుగు... అయ్యో...

సంధ్య: (ఏడ్పు)

శశి: ఎంత పని? సంధ్యా... ఆఖరికి వైధవ్యం కూడానా నీకు?

సంధ్య: శశిబాబూ—

శశి: సంధ్యా—ఇంత అకస్మాత్తుగా ఆయన కేమైనా జబ్బా?...

సంధ్య: ఆదినుంచీ ఉన్న జబ్బే — ఉబ్బసం — ఈ దౌర్భాగ్యురాలు అక్కడ పాదం పెట్టినదగ్గరనుంచీ ఆయన మంచం దిగనేలేదు. ఈ వర్షాకాలం రావడంతో మరింత ఎక్కువైంది. తీయకుండా జ్వరం—పదిహేను రోజులనాడు—(తీవ్రంగా దుఃఖిస్తుంది.)

శశి: భగవాన్...

(వాతావరణం నిశ్శబ్దంగా)

శశి: సంధ్యా—(దగ్గుతాడు)

సంధ్య: అయ్యో మీ ఆరోగ్యం ఇంత అధ్వాన్నంగా ఉందే?

శశి: ఇది చరమాంకం సంధ్యా! ప్రేమలోని వియోగ శక్తి ఇప్పు డర్థమవుతోంది. జీవితం శోభిస్తుందా అని అడిగావు ఒకప్పుడు. నాటికి నేటికి నాకు సమాధానం లభించనే లేదు — సంధ్యా — ఆ కిటికీ తలుపులు తెరుస్తావా?

రామ్: తెరవద్దు బుల్లమ్మగారు. డాక్టర్ బాబు చెప్పారు. చలిగాలి సోకితే ప్రమాదమని...

శశి: డాక్టరు కేం తెలుసు సంధ్యా—తలుపు తెరువు...

(తుఫాన్—విషాద సంగీతం ఎక్కువగా)

సంధ్య: (ఆదుర్దాగా) శశిబాబూ తుఫాన్ వొస్తోంది...

రామ్: తలుపులు వేయండి బుల్లెమ్మగారూ...

శశి: వద్దు వద్దు సంధ్యా — చివరిసారిగానైనా నా ఆజ్ఞ పాలించలేవా?

సంధ్య: ఇప్పుడు కూడానా శశిబాబూ...

(తలుపులు మోగుతుంటాయ్)

శశి: ఎందుకు వృథా ప్రయత్నం సంధ్యా—ఆ తలుపులు నీవు మూయలేవు. రానీయ్. ఆ తుఫాన్ ఎంతహాయిగా వుంది లోకానికీ, సంఘానికీ భయానకమైన ఈ ప్రళయ బీభత్సంలోకూడా ఏదో అనిర్వచనీయమైన మహాశక్తి నృత్యం చేస్తోంది.

సంధ్య: శశిబాబూ! సమస్త అనుభూతుల్నీ రసాల్ని మేళవించి అమరగానం వినిపిస్తోంది.

శశి: ఎంత సుందరదృశ్యం సంధ్యా...

సంధ్య: శశిబాబూ...

శశి: విరిగిపడే ఆ సముద్ర తరంగాలమీద అతి లావణ్యమైన కాంతుల్ని చిమ్ముతో వొచ్చే తుపానుల్ని అహ్వానించు...

(తిరిగి తుఫాన్ విషాదం)

శశి: (క్షీణస్వరంతో) సంధ్యా... తుసాన్ హెచ్చిందా? రాత్రి పడిందా?

సంధ్య: (రోదిస్తూ) శశిబాబూ...ఆఁ

(శశిబాబు దగ్గుతూ దగ్గుతూ పడిపోతాడు. సంధ్య అతనిమీద వొరిగిపోయి ఏడుస్తుంది)

---

## పాత్రలు:

* శ్రీ గురజాడ గిరీశంగారు.
* శ్రీ మొక్కపాటి పార్వతీశంబాబు.
* శ్రీమతి వటీరావు చింతా.
* అసరయ్యా వురఫ్ అసిరిగాడు.



ఒక ముఖ్యమైన విషయం :

(ఇటీవల ఆంధ్రదేశంలో ప్రఖ్యాతిచెందిన ఒకానొక రైల్వే
స్టేషన్ విశ్రాంతి మందిరంలో ఒకానొక సమయంలో
ఒకేసారి హఠాత్తుగా ప్రారంభమై, ఖచ్చితంగా
అంతరించిన ఒక సన్నివేశమే దీనికి
ఆధారమని రచయిత వేడికోలు.
ఇంతకుమించి మరేమీ లేదు)

హాస్య నాటిక

# అడ్డం తిరిగింది

(రైలు వచ్చి వెళ్ళిపోయింది. మళ్ళా అరగంటను గాని బండిరాదు. "వెయిటింగ్ రూమ్"లో గిరీశం, అశిరిగాడు.)

గిరీశం: అసిరీ !

అసిరి: అయ్యా !

గిరీశం: మనం ఇప్పు డేం చెయ్యాదలచుకున్నాం ?

అసిరి: పూట కూళ్ళింటి కెళ్ళేసి......

గిరీశం: నాన్సెన్స్ ! ఆ మాటెత్తొద్దని థౌజెండ్ టైమ్సు చెప్పివుంటాను.

అసిరి: సిత్తం. పొద్దెక్కి సూత్తుంటే పేగులు బేవ్ మని గీ రెడుతున్నాయ్, గిరీశంగోరూ !

గిరీశం: నీ మొహం ఈడ్చిరి! నీలాంటి బాక్వర్డ్ పీపుల్ని సీమలో అయితే ఏం చేస్తారో తెలుసా ?

అసిరి: నా మొహం, నాకేటి తెలుత్తది బాబూ ?

గిరీశం: బూట్కి పాలిష్ వేసినట్టు, నీలాంటివాళ్ళ మొదడుకి పాలిష్ వేసేస్తారు !

అసిరి: అదేటి బాబూ! కాల్ది తీసి నెత్తికి రుద్దేయటం ?

గిరీశం: నువ్వొత్త ఫూల్వి రా!

అసిరి: సిత్తమయ్యా!

(ప్రక్కనే బైరాగివా డొకడు పాడుతూంటాడు—)

బైరాగి:

అన్నమైతే నేమిరా, మరి
సున్నమైతే నేమిరా, అందుకే
ఈ పాడు పొట్టకు
అన్నమే వేతాముగా!

అసిరి: బైరాగోళ్ళు మా సూటయిన మనుసులు, బాబూ!

గిరీశం: ఎందుకనిరా ?

అసిరి: యేలకింత ప్రసాదం సాపడమంటారు.

గిరీశం: నీ తలకాయి !

అసిరి: పూటకూళ్ళింటి కెళ్ళి, కమ్మగా ...

గిరీశం: మళ్ళీ పూటకూళ్ళంటావ్! డర్టీ ఫెలో, ఆ మాటెత్తొద్దనలేదూ ... ...

అసిరి: అలాగేనయ్యా!

గిరీశం: అసిరీ ...

అసిరి: అయ్య ... ... ...

గిరీశం: మనకో మాంచి బ్యూటిఫుల్ కొశ్చిన్ వొకటి బ్రైన్‌కి పట్టేసింది !

అసిరి: అదేంటి బాబూ ! నరమేదన్నా పట్టింది కాంవాల ?

గిరీశం: నరం కాదోయ్, అసిరీ ...

అసిరి: మరేంవిటి !

గిరీశం: చెప్తా ... బైరాగులు ఏం చెస్తార్రా ?

అసిరి: సిటాకాలు సెప్పేస్తారు !

గిరీశం: నో, నో, ఇంకా ...?

అసిరి: సేతులు సూత్తారు.

గిరీశం: చూసి ...?

అసిరి: సేతుల్లో గీతలు సూసేసి, మన రాతలు సెప్తారు!

గిరీశం: మా వెంకటేశం కన్నా చురుకైన మనిషివోయ్...
దటీజ్ రైట్? మరి, మనఁవేం సెబుతాఁవో కనుక్కో?

అసిరి: మళ్ళా బండొచ్చేదాకా కూకుని, వొచ్చీపోయే
ఆడాళ్ళనీ మొగాళ్ళనీ లెక్కేసి, మొత్తం సెప్పెయ్యడం!

గిరీశం: నాన్సెన్స్! భగవంతుడు నీకు బుర్ర ఇవ్వలేదురా!

అసిరి: సిత్తం. ఇవ్వకేం బాబుగోరూ? ఈ బుర్రతోపాటు రెండు
సేతుల్నీ, మరి గత్తే, గంపెడు పిల్లల్నీ కూడానండీ...

గిరీశం: కట్టిపెట్టు...

అసిరి: అంతేనయ్యా!

గిరీశం: మనం సేతులు సూడం రా!

అసిరి: మరేటి సూత్తారు, బాబూ?

గిరీశం: ఫేసెస్ ... అంటే మొహాలు చూసీచూడ్డంతోటే
వాళ్ళ పుట్టూ పూర్వోత్తరాలు చెబుతాం.

అసిరి: నే నన్నాను కాదాండీ! మనం మొహాలు నెక్కెత్తా
మని!...

గిరీశం: అది కాదురా! వాళ్ళ జీవితంలో జరిగేవన్నీ మనం,
ఇట్టే చెబుతాం.

అసిరి: ఏఁవిటీ, అంతా సెప్పెయ్యడఁవే?

గిరీశం: మరేఁవి టనుకున్నావ్ ? మనం సీమ-లో ఈ ఆరేళ్ళూ నేర్చుకున్న బ్రహ్మవిద్య అదే ! అదేనోయ్ అసిరీ !

అసిరి: ఏ సాములవారి దగ్గర అబ్బుకున్నారు బాబూ ! ఈ యిద్దె ?

గిరీశం: అక్కడ సాములుండవ్రా. పెద్ద పెద్ద ప్రొఫెసర్సు ఉంటారు.

అసిరి: సీమలో మీా రేటి సేసేరు ?

గిరీశం: అక్కడున్న యావన్మందికీ మనం జ్యోతిష్యం చెప్పేశాం!

అసిరి: మరిగత్తే, మీారూ—...బైరాగులో రన్నమాట !

గిరీశం: మనకీ వాళ్ళకీ సంబంధ మేఁవిట్రా!

అసిరి: అవు నయ్యా, అంతే !

గిరీశం: (దూరంగా చూసి) వెయిట్, వెయిట్...ఆ కుర్రా డెవర్రా ?

అసిరి: వో రండీ ?

గిరీశం: ఆ సిల్కులాల్చి తొడుకున్న కుర్రాడు. దుత్తల్లే వున్నాడు.

అసిరి: ఈ ఊరే నేమోనండీ !

గిరీశం: మన బుచ్చెమ్మ తమ్ముఁడు గుర్తొస్తున్నాడు. అచ్చంగా ముమ్మూర్తులా అంతే సుమీా !

అసిరి: మాట కలపమంటారా ?

గిరీశం: ఆ పేప రిటివ్వు చెప్తా !—అతగాడు టికెట్ ఎక్కడికి తీసుకునేది వాకబుచేసిరా ! వెళ్ళు.

అసిరి: అలాగేనయ్యా... (వెళతాడు)

గిరీశం: ఐ టరన్డ్ ఆల్ టుగెదర్ ఏ న్యూ లైఫ్!... ఆ పిలక లుబ్ధావధాన్లచేత వో "పవరాఫ్ ఎటార్నీ మా" రాయిం చేసుకునుంటే—నాకీ అడ్డమైన తిరుగుళ్ళు వుండేవి కాదు గదా!...మళ్ళీ ప్లినియోనిజమ్‌లో పడుతున్నాం. ఏమిటిది చెప్మా!...ఐ టరన్డ్ ఆల్ టుగెదర్ ఏన్యూ లైఫ్...!

(గిరీశం పేపరు చదువుతూంటాడు. ఆ ప్రక్కగా అసిరిగాడూ, పార్వతీశం ప్రవేశిస్తారు.)

అసిరి: మంచి రద్దీగా ఉంది, కామోను! కూసే పాగి తీయొచ్చు లెండి!

పార్వ: కాసేపు కాకపోతే, మరింకాసేపు ఆగుతాను. టిక్కెట్టిమ్మంటే ఎక్కడకంటాడు. నా గొడవ తనకెందుకో; నే నెక్కడికి పోతేనేం?

అసిరి: నిజం సెప్పారు! తమ పేరేవిఁటి, సెలవిచ్చారు కాదు?

పార్వ: నే నేఁవిటి సెల వివ్వాను? స్కూలూ, సెలవలూ అన్నీ అయిపోయాయి.

అసిరి: (నవ్వి) అదికాదు బాబూ, తమపేరు...

పార్వ: అదా? "పార్వతీశం"...నీది ఈ వూరేనా...

అసిరి: వెనక ఒకప్పుడు ఈ వూళ్ళోనే కొలువుండిపోయాను లెండి. ఇప్పుడు గిరీశం మనిసినండి!

పార్వ: గిరీశం గారా ? ఆయనెవరు ?

అసిరి: మా బాబయ్యనే ఎరిక లేదా ? ఆయనంతోడు ఈ బూమ్మీమ్మీన వున్నాడా ? సీఁవలో ఆరేళ్ళాయి...

పార్వ: ('సీమ' అనగానే హఠాత్తుగా మారి) ఏఁవిటీ ? మీా గిరీశంగారు సీమలో ఆరేళ్ళున్నారా ? ఇప్పు డెక్కడున్నారు ?

అసిరి: అవును బాబూ, ఇప్పు డిక్కడే వుంటున్నారు. మీాలాంటి కుఱ్ఱాళ్ళంటే ఆయనికి మా చెడ్డసరదా! మరేటి...వోసారి మాటాడి సూత్తారా ?

పార్వ: చూడబ్బాయ్ ! నీ పేరేఁవిటో తెలీదు; కాని...

అసిరి: నన్నందరూ అసిరి అంటారు లెండి. వెనకో అవధాన్లు గోరుమాత్రం 'గాడు-గీడు' అని తోక తగిలించేరు. మా గిరీశం బాబుగోరు అలాంటి దేఁవీ లేకుండా అచ్చంగా పేరుబెట్టే పిలుస్తారండీ !

పార్వ: ఆయ నేఁవన్నా వుద్యోగం సద్యోగం చేస్తున్నారా ?

అసిరి: ఉద్యోగం ఎందుకండీ ! దివాన్నిగీ సెలాయించడానికి పెద్దపెద్దోరు పిలిపిత్తేనే ఆయన తలూప లేదండి !

పార్వ: ఓహో!...ఎంత గొప్పవారో...

అసిరి: మరేటి...సూత్తారా...

పార్వ: అంతకన్నానా ? ఎక్క డున్నారన్నావ్ ...

అసిరి: ఆరే... పేపరు సూత్తున్నారు కాదా...గిరీశం బాబు గోరూ! మన పారుతీశంగా రొచ్చేరండి.

పార్వ: నమస్కారమండి.

గిరీశం: నమస్తే... ఇలా కూచో...

పార్వ: మీరు సీమలో ఉంటున్నారా అండీ!

గిరీశం: (నవ్వి) అవునవును. నీ పేరు పార్వతీశంకాదూ?

పార్వ: అవునండీ! మీరు సీమనించి వొచ్చి ఎన్నాళ్ళయిందండీ?

గిరీ: నేను రావడ మేఁవిటీ? పోవడ మేఁవిటీ? (నవ్వి) నెలకో రెండు సార్లన్నా అధనుం రావడం, పోవడం...

అసిరి: మరేఁవి టనుకున్నారు, బాబుగోరంటే...?

పార్వ: అలాగాండీ?

గిరీ: మీలాంటి కుర్రాళ్ళకి తర్ఫీదు ఇచ్చి సీమకి తీసుకుపోవడం, అక్కడ వాళ్ళని పెద్ద పెద్ద ప్రొఫెసర్లుగా తయారు చేయించడం; ఇలాంటి దేశసేవకి సంబంధించిన పనులు చూస్తూంటాను.

పార్వ: లోకానికి వుపకారం చేస్తుంటారన్నమాట!

గిరీశం: ఉపకారం కాదు! సర్వీస్ ... సేవ!

పార్వ: అలాగాండీ...?

గిరీశం: సేవ, సర్వీసు ఈ కంట్రీలో ఏఁ వుంది? చూచినా సీమలోనే చూడాలి.

పార్వ: అక్కడంతా బావుంటుందాండీ?

గిరీశం: అక్కడ సర్వీస్ అంటే బిజినెస్ అన్నమాట! దీన్ని గురించి నేనోసారి సీమలో వైట్‌హౌస్‌లో ఏం చేశా

నంటే—విను ! ఆరునొక్క ఘంట ఏకధమ్మైన స్పీచ్ ఇచ్చేశాను. దాంతో కన్సర్వేటివ్‌లూ, సోషలిస్టులూ అంతా డంగై, ఏకకంఠంగా కంగ్రాచ్యులేష న్సిచ్చారు!

పార్వ: తమవంటి పెద్ద లుండబట్టే ఈ దేశం పేరు నలు మూలలా వెల్లడి కొస్తూంది.

అసిరి: పారుతీశంబాబూ ! మీరొక పర్యాయం అటు సీమ కెల్లేసి రాకూడదూ ?

గిరీశం: వెరీగుడ్. బ్రిలియంట్ ఐడియా ! నీలాంటివాళ్ళే సీమలో రాణిస్తారు. నీలాంటి వాళ్ళకి సీమలోని పిర మిడ్సూ, నయాగరా వాటర్ ఫాల్సూ అన్నీ చూపించే స్తినా ... మరి కల్చరంతా అబ్బేస్తుంది ! ఇక్కడేముం దోయ్ కల్చర్ ! సీమ తుమ్మచెట్లూ, రక్కెసి పొదలున్నూ ...

పార్వ: మీరు ఇందాకట్నుంచీ మనవి చేద్దామనుకున్నాను. సీమ కెళ్ళాలని మహా ఇదిగా నా మనసు పీకుతూందండీ! కానయితే, ఇంగ్లీషు రాందే వెళ్ళనియ్యరని ఎవరో చెప్పారు ...

గిరీశం: నాన్సెన్స్ ! ఎవరా మాట చెప్పింది? మై డియర్ పూర్ ఫెలో ... నా వెంట నాలుగు రోజులున్నావా ... ఇంగ్లీషేఁవిటి, దాని తాతమ్మలాగా రాదూ? లెక్చర్లిచ్చే సమర్థత ఇప్పిస్తాను. వారం దాటాక "షా" ఫిజిక్స్‌తో సహా షేక్స్పియర్ హిస్టరీ నోట్సుకూడా చదివేయొచ్చు. అయినా, ఆ చెడ్డ ఇబ్బందెందుకు ? మన తెలుగువాళ్ళ

కోసం సీమలో ప్రత్యేకం ఓ కాలనీ ఏర్పాటు చేశాను. మన నేషన్ లీడర్ే, ఒకాయనచేత దానికి ప్రారంభోత్సవం చేయించానుకూడా. ఆయన ఈ మధ్య మంత్రి అయినట్టు కేబుల్ అందుకున్నానుకూడా. సరే!... నీలాంటి అభివృద్ధికి రాదగిన వాళ్ళందరికీ కొన్నాళ్ళపాటు ఆ కాలనీలో వసతి సౌకర్యాలు ఏర్పాటు చేశాను.

పార్వ: మా వాళ్ళ కెవ్వళ్ళకీ తెలీకుండా వొచ్చేద్దా మనుకుంటున్నాను. మీరు నన్ను తేలుస్తానంటే-వొచ్చేస్తాను మీతోపాటే !

అసిరి: తేలడాని కేటుంది, పారుతీశంబాబూ! చేతిలో నాలుగు చిలక లుంటే సరి !

గిరీశం: యస్, యస్. మనీమేక్స్ మెనీథింగ్స్ అన్నాడోయ్ అనంతాచార్యులు !

పార్వ: అవునండీ ! డబ్బులేనివాడు దుబ్బుకి కొరగాడని మా బామ్మ అంటూంటుందండీ !

గిరీశం: చూశావుటోయ్ పార్వతీశం ! మనం పెద్దవాళ్ళ మాటల్ని రికగ్నైజ్ చేస్తుండాలి ! కొన్ని విషయాల్లో సుమా !... అన్నట్టు, అసిరీ ! కాస్త ఏదన్నా టిఫిన్ తీసుకు రారా !

అసిరి: మరిందాక చిల్లర మారలేదు కదండీ !

గిరీశం: ఇదో న్యూసెన్స్. ఈ కంట్రీలో చిల్లరతప్ప చెక్కు-లేన్లె వాడరు. సీమలో బంగారం తప్ప మరేఁవిటీ ఉండదు !

పార్వ: నావద్ద ఉందిలెండి. ఇస్తాను... ఫర్వాలేదు లెండి... ఇదిగో అసిరీ...

(అసిరి వెళ్ళిపోతాడు)

గిరీశం: చూడు పార్వతీశం! ఇప్పుడు మీగు ఆక్స నేషన్సువారు ప్రపంచం బాగుపడేందుకు ఏం చేశారంటే—వో కమిటీని వేశారు. ఆ కమిటీ చేసే పనేవిటీ? ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ ఉన్న మంచి మంచి నిషధ యోగ్యుల్లాంటి కుర్రాళ్ళని చూసి, రప్పించి వాళ్ళకి రెండేళ్ళపాటు సీమలో కోర్సు చెప్పించడం!...

పార్వ: కోర్సా అండీ! ఆ పైన... ...?

గిరీశం: కోర్సు అయిపోగానే... ...ఆ పైన, నెలకి పదిహేనొందల జీతమ్మీద వారే ఉద్యోగా లిప్పిస్తున్నారు. ఉంటానికి చలవరాతి బంగ్లా, కారూ గీరూ, అంతా వండర్‌ఫుల్ లైఫ్ లీడ్ చేయొచ్చులే!

పార్వ: ఆ కమిటీవా ళ్ళెవరన్నా మన దేశంలో ఉన్నారండీ?

గిరీశం: లేకేం? వొద్దంటున్నా, మన దేశంతరఫున నన్ను వేసుకొన్నారు కమిటీలో. నేషనల్ కాంగ్రెస్‌వారూ గమ్మత్తు చేశార్లే. ఇక్కడుంటే ఏ ప్రధానమంత్రిపదవో ఇవ్వాలసి వొస్తుందని, బలవంతాన నన్ను ఫారెన్ కమిటీలో పడేశారు. నాకూ అదే యిష్టం! ఇక్కడ మొటికల్లాంటి, జాతి రత్నాల్లాంటి యూత్‌ని వెలికి సీమకి ఎక్స్‌పోర్ట్ చేయడం, ఇదీ మన వర్క్.

పార్వ: మీ రెలాగయినా నన్ను తీసుకోవాలి. వింటూంటే వొళ్ళు పులకిరిస్తోంది.

గిరీశం: ఇప్పటికే వందలమంది "నన్ను తీసుకుపోండంటే, నన్ను తీసుకుపోండని" గోలపెట్టి వెంటపడుతున్నారు. నేనే ఆలోచిస్తున్నాను ఇంకా...

పార్వ: చిత్తం, తమరిపుణ్యాం!... నేను మరచిపోను.

గిరీశం: ఏమీలేదు. అక్కడ మొదట్లో మన పాకెట్ మనీతో కాలం గడపితే, ఆపైన లీగ్ ఆఫ్ నేషన్స్‌వారు స్టయిఫెండ్ ఇస్తారు.

పార్వ: దానికేంలెండి! మావా ళ్ళెవరికీ తెలీకుండా బామ్మ దాచుకున్న అయిదొందలరూపాయలు తెచ్చాన్లెండి!

గిరీశం: ఓ, యస్! చాలు: ఆపైన నువ్వింతవాడ వయ్యావని టెల్లిగ్రాఫ్‌మీద కేబుల్ కొడితే—మీవాళ్లే పంపిస్తారు. సరి, ఆ మనీ ఎక్కడవుంచావ్? సేఫ్‌గా ఉందా అని?

పార్వ: (తటపటాయించి) ఈ వూళ్ళోనే ఓ మిత్రుడివద్ద వుంచానండీ!

గిరీశం: సరే, తీసుకురండి! ఈరాత్రే మెయిల్‌లో మద్రాసు పోదాం. వాటిని మద్రాసులో షిల్లింగులకింద మార్చుకో వలసివుంటుంది. సీమలో మన నాణాలు చెల్లవు.

(అసిరి టిఫిన్ తెస్తాడు.)

అసిరి: ఇదిగోనండయ్యా!

గిరీశం: పార్వతీశం తీసుకోవోయ్ కాస్త టిఫిన్.

పార్వ: అక్కర్లేదండీ మాస్టారూ! ఇంతకుముందే మాబామ్మ గడ్డపెరుగేసి పెడితే కడుపునిండా తిన్నాను.

గిరీశం: మనకంట్రీలో ఇంతేనోయ్ పెరుగన్నం, పచ్చడి మెతుకులూ... సీమలో ఐనట్టాయనా ఫ్రూట్స్, కేక్స్ అంతా విటమిన్ 'ఏ' పదార్థాలే సుమీ!

(దూరంగా 'కూలీ—కూలీ' అని కేక.)

గిరీశం: ఎవర్రా అసిరీ?

అసిరి: ఎవరోనండీ; దొరసానిలా వున్నారు.

గిరీశం: ఐ సీ! పార్వతీశం! నేను సీమలో వుమెన్స్ క్లబ్ కూడా ఎస్టాబ్లిష్ చేశాను. మనకంట్రీలోకనక ఆడవాళ్ళని బాని సల్ని చేశారుకాని, సీమలో ఫుల్ ఇండిపెండెన్స్ ఇచ్చే శారు. అక్కడివాళ్లంతా అన్నిరకాలా ఇండిపెండెంట్‌గా ఉంటారు. మనక్లబ్ లో వందమందిమెంబర్సు వున్నార్లే!

పార్వ: మావూళ్ళోనూ వుందండీ క్లబ్! మా చుట్టాలే లెండి! 'వటీరా'వనే ఆవిడ సెక్రటరీ.

గిరీశం: ఏఁవిటీ, వటీరావుది మీ వూరేనా?

పార్వ: అవునండీ!

గిరీశం: చెప్పావు కావేఁ? నాకు బాగా తెలు సావిడ! నా క్లాస్‌మేటు కూడాను.

అసిరి: ఆ దొరసాని ఇటే వత్తున్నారండీ!

(వటీరావు వచ్చింది. చురుగ్గా వుంటుంది.)

వటీ: హల్లో గిరీశం ! ఇక్కడ సెటిలాయించారేం ?

గిరీశం: ఆఁ ఏం లేదు, శ్రీమతి వటీరావ్గా ! ఏదో ఇటు వెళుతూ, వెళుతూ ఇక్కడ దిగాను !

వటీ: ఈసారి కాంప్ ఎక్కడ ? (పార్వతీశాన్ని చూచి) అరే, ఇదేఁవిటి పార్వతీశం ? ఇక్కడ కూచున్నావేం ? ఏదో గిరాకీ వుందన్నమాట ?

పార్వ: ఏం లేదు. చుట్టాలొస్తారు, రైలుకెళ్ళమని బామ్మ చెబితే వొచ్చాను.

గిరీశం: ఇపుడే విన్నాను. పార్వతీశం మీా రెలెటివ్ అని. చాల మంచి కుర్రాడండి ! పైకి రాదగ్గ...

వటీ: (విరగబడి నవ్వి) మిస్టర్ గిరీశానికి దొరికేవాళ్ళంతా డైమండ్సలాంటివాళ్లే !... మళ్ళా ఏఁవన్నా కాన్స్పిరసీ సాగిందా ఏమిటి ?

గిరీశం: నో, నో, గిరీశం ఇపుడు ఫిఫ్టీ టూ మోడల్. టర్న్డ్ ఆల్ టుగెదర్ ఏ న్యూ లైఫ్ !

పార్వ: గిరీశంగారు నన్ను సీమకు తీసుకుపోతున్నారుగా !

అసిరి: అమ్మగారికి అయ్యగారు బాగ తెలుసుననుకుంటాను. నానుకూడా సీమకి చెక్కేత్తాను !

వటీ: వాట్ గిరీశం! నువ్వు సీమకి వెళ్ళావా? వెళుతున్నావా ?

గిరీశం: వెళదామనే ట్రై చేస్తున్నాను.

పార్వ: ఈ రాత్రికే ప్రయాణం పెట్టారు. ముందు మద్రాసు, ఆ తర్వాత...

వటీ: వోరే అబ్బీ, చాలు. కాని, డబ్బెంత తెస్తున్నావ్ ?

పార్వ: ముందు అయిదొందలు తెస్తున్నా. ఆపైన కేబులు రాస్తాను.

గిరీశం: శ్రీమతి వటీరావ్ ! నా చివరికోరిక ఇదొక్కటే ! ఈ కంట్రీనుంచి వెళ్ళిపోదామని...... 

వటీ: చాలా బాగుంది, గిరీశం! నీలాంటివాళ్ళు ఎంత త్వరలో వెళ్ళిపోతే అంత మంచిది. లేకపోతే పార్వతీశంలాంటి కుర్రాళ్లు అన్యాయంగా చెడిపోతారు. ఈ అయిదొందలు మద్రాసు పాలయ్యేవి. అలో లక్ష్మణా, అంటూ ఆ నోరు లేని పార్వతీశం దిక్కులేనివా డయ్యేవాడు.

అసిరి: అదేటి బాబుగోరూ ! సీమకి చెక్కడం మరిలేదా ? ఏటి ?

గిరీశం: నో, నో, మాటాడించకు. కొలాప్స్డ్ ......

వటీ: ఇంకెందుకు మాటాడించటం నిన్ను. వోరేయ్, పార్వతీశం ! అయిదొందలూ పోయి, భ్రష్టుడివై పోయేవాడివి.

పార్వ: మాస్టారు నెలకి రెండుసార్లు సీమకి వెళ్లుతున్నారట !

వటీ: నీ మొహం, పదవోయ్ ఇక ఇంటికి. నిన్నటిదాకా విశాఖపట్నంలో గడిపాడు. ఇవాళ్ళవూరు, రేపో వూరు !...

అసిరి: అయ్యా, బాబుగోరూ ! నా గతేం చెప్పారు ?

వటీ: అసిరీ ! ఇంటికి పోయి కూలో నాలో చేసుకు బ్రతకటం చాలామంచిది. ఎందుకు తిరిగి చెడతావ్ ?.........

గిరీశంగారూ ! ఇంకా ఎన్నాళ్ళు ఈ "న్యూ లైఫ్" ?

గిరీశం: డామ్ నాన్సెన్స్! లాస్ట్ మినిట్‌లో వటీరావనే మరో డెవిల్‌తో——

వటీ: షటప్! డెవిల్ గివిల్ అన్నావంటే పళ్ళూడిపోతయ్.

అసిరి: అయ్యో బాబుగోరూ! మరి నాభంగనేదు.

గిరీశం: మై గాడ్!

వటీ: నీలాంటివాళ్ళని పుడకలమీద పెట్టినపుడే బుద్ధివచ్చేది... గుడ్ బై.

(వటీరావు, పార్వతీశం వెళ్ళిపోతారు.)

గిరీశం: అసిరీ! చెలో, విశాఖపట్నం ట్రైన్ వొస్తోంది. టిఫిన్ తేగా చిల్లర మిగిలిందికదూ?

అసిరి: టిక్కట్లకొత్తాయ్, బాబుగోరూ!

---

## ఇందులో

| | | |
|---|---|---|
| పురుషోత్తం | .... | ఉపాధ్యాయుడు |
| విమల | .... | ఉపాధ్యాయిని |
| గోపి | .... | పురుషోత్తంకొడుకు |
| పాపారావు | .... | ఇరుగుపొరుగువాడు |
| మున్సబ్ | | |
| కరణం | | |
| స్కూళ్ళ ఇనస్పెక్టర్ | | |
| రాము } శంభు } | .... | విద్యార్థులు |
| బంట్రోతు | | |



ఇటీవల ఒక పల్లెటూళ్ళో పొద్దుటిపూట మొదలై,
అప్పుడే ఆఖరైన సంఘటన యిది.

# బ డి పం తు లు

## దృశ్యం :

(పాడుబడుతూన్న పాక. పురుషోత్తం పంతులుగారి గది. 'నేలపాడు ఎలిమెంటరీస్కూల్' అని రాసిన బోర్డూ, మాసికలు వేసిన దేశపటం, ప్రబోధవాక్యాలు రాసిన అట్టలు, వాటన్నిటి మధ్య బాపూజీ చిత్రపటం గోడమీద వేలాడుతున్నాయి.

రంగస్థలంలో ఎడంవేపున చేతుల్లేని కుర్చీ, సొల్డ్రాయరుగూను. నాటికి ఎడంవేపుగా కుడివేపుకి అభిముఖులై నలుగురు కుర్రాళ్ళు కూచున్నారు.)

## తెర లేచేసరికి:

(విమల కుర్చీలో కూచునుంది. బొద్దుగా ఉండడంచేత వయస్సు ఉన్నట్టు కనిపిస్తుంది. జీవితంలో కష్టాలు అనుభవించినట్లు ముఖచిహ్నాలు కనిపిస్తవి.

ఆమె పుస్తకం తెరచి మాటలు విరిచి చెబుతూంటే, పిల్లలు రాసుకొంటున్నారు.)

**విమల:**

అడిగిన జీతం బియ్యాని
మిడిమేలపు దొరనుగొల్చి బ్రతుకుట కంటెన్
వడిగల యెద్దుల కట్టుక
మడిదున్నుక బ్రతుక వచ్చు మహిలో సుమతీ !

మళ్ళీ వొకసారి చదువుతాను. తప్పు లున్నాయేమో చూసుకోండి. (పద్యం చదివి) అందరూ సరిగా రాసుకున్నట్టేనా ?

పిల్లలు: (తలా వొక గొంతుతో) ఆఁ...ఆఁ...ఓ...

విమల: (పుస్తకం మూసేసి) పెద్ద మాస్టారు ఊరునించి ఇప్పుడే వొస్తారు. ఆయన వొచ్చాక తాత్పర్యం చెబుతారు. ఈ లోపల పద్యం కంఠతా పట్టండి. (లేచి) తెలిసిందా ? అల్లరి చెయ్యకండేఁ ?

(విమల పిల్లల మధ్యగా తన గదిలోకి వెళుతుంది. పిల్లలు తలా వొక ఫోగణితో పద్యం చదువుతారు.)

రాము: ఒరేయ్ చెంబూ !

శంభు: (మిరి మిరి చూస్తాడు)

రాము: పలకవేఁ ?

శంభు: పేరు పెట్టి పిలవలేవ్రా ?

రాము: మహారాజులాగ పిలుస్తాను. ఒక్క చేగోడీ పెట్టుమరి !

శంభు: నీకా ? చేగోడీ లేదు పకోడీ లేదు, పోవోయ్ !

రాము: (కలుపుగోలు తనంగా) మనిద్దరం జతకదరా ! మరి వొక్కటంటే వొక్క చేగోడీ పెట్టు.

శంభు: ఒక్కటి కాదు, అరకాదు, ఆఖరికి చీమకాలంత నలుసు కూడా పెట్టను.

రాము: పోరా సాంబా ! మధ్యాహ్నం మా అమ్మ గుగ్గిళ్లు— అలసంద గుగ్గిళ్ళు పెడతానంది, చూసుకో...

శంభు: గుగ్గిళ్లా ? (వెక్కిరింపుగా) తిను, బాగా తిను. అవి చాలకపోతే సాయంత్రం మా ఇంటికి రా ! ఉలవగుగ్గిళ్ళు కావలసినన్ని ఉన్నాయి.

రాము: (ముఖం చిట్లించి) ఏడిశావ్ లే ! జేబులోవున్న చేగోడీ పెట్టడానికి ప్రాణం ఒప్పడంలేదు, ఇంటికొస్తే గుగ్గిళ్ళు పెడతాడంట, మొనగాడు ! ఏం మొహంరా బాబూ !

శంభు: (రామూని ఊరిస్తూ ఒక చేగోడీ నోట్లో కుక్కుకుంటాడు.) పంతులమ్మగారొస్తున్నారు. చదువు పద్యం.

రాము: ఆఁ...రానియ్...నీ సంగతి చెప్తా !

శంభు: మహ చెప్పావ్ లే ! (చేగోడీలు ఇస్తూ) ఇంద. తొందరగా తినెయ్. పద్యం చదువుకుందాం.

(గట్టిగా చదువుతారు. విమల వచ్చింది)

విమల: ఊఁ... (పిల్లలు నిశ్శబ్దం) ఏం వాన వెలిసినట్టు మెదలకుండా కూచున్నారేం ? మనకు చదువు సంధ్యలెందుకు ? చెయ్యదలచుకున్న అల్లరంతా చేసెయ్యండమ్మా. (పిల్లలు తలవొంచుకుంటారు. లేనికోపం నటిస్తూ) కాసేపయినా వళ్ళు దగ్గరుంచుకుని చదువుకోవద్దూ ? ఎలాగోయ్ మీతో ? మరీ, రామూ, శంభూ గొంతులు పెద్దవవుతున్నాయి. పద్యం అప్పచెప్పేటప్పుడురాదేం ఆగొంతుక? పిల్లలు బెదిరినట్టు బెంగగా చూశారు. (రామూని శంభూని రమ్మని సైగచేసి, వెన్ను తడుతూ) మీకు చురుకూ తెలివితేటలూ మాత్రమే చాలవమ్మా...కాస్త శ్రద్ధా, భక్తీ ఉంటేనే నాలుగు ముక్కలు వంటిను

పడతాయ్. అల్లరి మానేస్తారా? చెప్పండి. (నోట్లో చేగోడీ లున్నాయి, కనక మాటాడలేరు పిల్లలు) ఏమిటీ మాటాడరు? బెల్లంకొట్టిన రాయిలాగ!

[గోపీ కుడివేపునించి వొస్తాడు. పదహారేళ్ళుంటాయ్. చినిగిన దుస్తులు. దిగులుగా ఉన్నాడు.)

విమల: ఏం నాయనా?

గోపి: మా నాన్న లేరాండి, విమలమ్మగారూ?

విమల: ఈ పాటికి రావలసిందే! బండి లేటయిందేమో! నే నింకా ఇంటికొచ్చారేమోనని అనుకుంటున్నాను.

గోపి: ఉఁహూఁ: వొస్తే, రాగానే ఇంటికోపర్యాయం రమ్మని చెబుతారు గదూ?

విమల: అలాగే బాబూ! (గోపి వెళుతూంటే) గోపీ!

గోపి: ఆఁ.

విమల: ఏవఁన్నా అర్జంటు పనుందా గోపీ?

గోపి: ఔనండి. మా చిట్టికి జ్వరం.

విమల: ఎప్పటి నించి?

గోపి: పది రోజులనించి. రాత్రి మరీ ఇదిగాఉంది. నాన్న గారుంటే బావుండును.

విమల: పదిరోజులనించి పాపకు జ్వరం వస్తూంటే మాస్టరుగారు మాట మాత్ర మన్నా చెప్పలేదు! అయ్యో... మరి, డాక్టరు గారిని పిలుచుకు రాక పోయావా గోపీ?

గోపి: నేను పిలిస్తే వొస్తారో... రారో...

విమల: వొస్తారు. పెద్దమాస్టరు గారబ్బాయినని చెప్పు. నాన్న గారు ఊళ్ళోలేరనికూడా చెప్పు. డాక్టర్ గారిల్లు తెలుసు కదూ? తీసుకొచ్చి చూపించు. (గోపీ వెళుతూంటే అనుసరించి) వెంటనే రమ్మని డాక్టర్ గారిని అసుగుతావ్ కదూ? (వెనక్కి తిరిగి యథా స్థానంలోకి వొస్తూ) పాపకు పది రోజులనించీ జ్వరం! ఈ జ్వరాలూ, రోగాలూ పనిపాటా లేకుండా వెతికి వెతికి వస్తాయి కాబోలు.

(ఏదో గొణుక్కుంటూ పాపారావు వొస్తాడు. పచ్చీ పైలాసగా ఉంటాడు. కాని బుర్రమాత్రం తక్కువ.)

విమల: (సమర్యాదగా) ఏఁవిటీ అంటున్నారు?

పాపా: ఆఁహఁ ఏం లేదూ! ఇవాళ ఎంత పొద్దెక్కినా ఎండ రాలేదేమిటా, అని అనుకొంటున్నాను. అంతే!

విమల: పైకంకోసం వచ్చారా? పొద్దుటే పంపవలసింది. పెద్ద మాస్టరుగారు ఈ పాటికే రావలసింది. ఆయన రాగానే కుర్రాళ్ళ చేతికిచ్చి పంపుతాను.

పాపా: ఇంకానయం! ముష్టి రెండు రూపాయలు అడిగి తీసుకోడానికొచ్చా ననుకుంటున్నారా? ఇంకా నయం... మరింకా ఏమీ అనుకోనందుకు మరింత సంతోషం! ఊరికే అటు పోతూపోతూ ఇటు వొచ్చాను.

రాము: మామయ్యా! అటు పోయేవాడివి ఇటెలా వొచ్చావ్?

శంభు: అడ్డదారిని వచ్చాడు లేరా!

విమల: చదువుకోండి.

పాపా: ఊరికినే వొచ్చాను... అన్నట్టు...

విమల: అన్నట్టు...? చెప్పండి.

పాపా: చూడండి. మనం ఇరుగు పొరుగు వాళ్ళమయినా ఎప్పటికప్పుడు మరిచిపోతుంటాను. మీ సలహా కావాలి. ఏం లేదూ... మా వదిన గా రబ్బాయి వొకడున్నాడు. వాణ్ణి బళ్లో చేర్పిద్దామనుకున్నాను. మా అత్త ఉత్త గయ్యాళిగంప. మీతో మాటాడదామనుకున్నా వీల్లేకుండా పోయింది.

విమల: మీ వదినగా రబ్బాయి విషయమేనా?

పాపా: ఔను.

విమల: తప్పకుండా పంపించండి. శక్తి వంచన లేకుండా శ్రద్ధగా చూస్తాం. అయితే మీ రొకసారి పురుషోత్తం మాస్టరుగారు రాగానే కలుసుకుని చెప్పండి.

పాపా: సరే, సరే!... ఏం లేదూ... (మరో ధోరణిలో) మీరు ఊఁ అంటే సరిపోతుంది.

విమల: (అర్థంకాక) ఆయనతో చెప్పకుండా చేర్చుకోడం బావుండదు. లోపల పిల్లలు గల్లంతు చేస్తున్నారు. వొస్తానండి.

(విమల వెళుతుంది. పాపారావు డ్రాయర్ దగ్గరకు వొచ్చి పుస్తకం తిరగ వేస్తుంటాడు.)

పాపా: ఏఁరా అబ్బాయిలూ! ఒహడికీ మొహానా జీవకళ లేదేఁవిరా?

శంభు: ఏం మామయ్యా! అలా అంటున్నావేఁ?

రాము: పెద్దాడు కదరా! మామయ్యా! తలాకాస్త పంచి పెట్టరాదూ?

పాపా: ఏమిటి?

రాము: అదే!

శంభు: జీవకళ!

పాపా: సరే, సరే! (జేబులోంచి ఓ కాగితం మడత (డ్రాయర్ మీది పుస్తకంలో పెడతాడు. పిల్లలు గమనిస్తూనే ఉన్నారు.) మీ పంతులమ్మగారు చదువు బాగా చెబుతుందిరా?

శంభు: మాకు పెద మాస్టరుగారు చెప్పేది.

పాపా: ఒహో! అలాగా! పంతులమ్మ చిన క్లాసులకు చెబుతుంది కాబోలు... రేపు మా వాణ్ణి కూడా బడికి తోలాలిరా.

రాము: కొబ్బరికాయలు —

శంభు: అరటి పళ్ళు —

రాము: పంపాలి సుమా!

పాపా: ఓ – పళ్ళకేం తక్కువరా! పావలా పారేస్తే పాతిక్కొస్తయ్.

(పాపారావు వెళిపోతాడు.)

శంభు: ఒరేయ్ రాముడూ! పాపారావు మామయ్య ఏదో కాగితం పుస్తకంలో పెట్టాడు. చూద్దామంటరా?

రాము: నేనూ చూశాను. మాస్టరుగారికి చీటీ రాశాడేమో! మధ్య మన కెందుకూ?

శంభు: అయితే యేం, చూడకూడదా?

రాము: పెద్దవాళ్ళ గొడవలు మన కెందుకురా? పద్యావొచ్చిందీ

అడిగిన జీతం బియ్యని మిడిమేలపు దొరనుగొల్చి....గొల్చి....

(పురుషోత్తం వస్తాడు. మాసిన మాసికలకోటు. సన్నగా జబ్బుపడిన వాడిలా కనిపిస్తాడు. వయసుకు మించిన వృద్ధాప్యం వచ్చేసింది. ఆయన్ని చూసి పిల్లలు లేచి నిలబడతారు.)

పురుషోత్తం: కూర్చోండి. (గొడుగు డ్రాయరుకి ఆనించి కూచుని) సరిగ్గా చదువుకుంటున్నారా?

రాము: కొత్త పద్యం చెప్పించుకొన్నామండీ.

శంభు: 'అడిగిన జీతం బియ్యని' పద్యమండీ.

పురు: అడిగిన జీతం ఇచ్చేదాత ఎవడున్నాడురా? ఇస్తామన్న రాళ్ళు ఇస్తే చాలు, అదే పదివేలు.

రాము: ఉత్త పద్యమే చెప్పించుకొన్నాం. మీరు తాత్పర్యం చెప్పాలండీ!

పురు: ఊఁ సరే.

శంభు: ఇపుడు చెబుతారాండీ?

పురు: నాలుగు నిమిషాలాగండి. నడిచి నడిచి కాళ్ళు నెప్పులు పుట్టాయి.

రాము: మరండీ, అడిగిన జీతంబియ్యని పద్యంలోనండీ...

పురు: ఇశ్ ...

(విమల లోనుంచి వొస్తుంది. పురుషోత్తం మొహం చూసి ఆందోళన చెందుతుంది.)

విమల: ట్రైన్ లేటయిందాండీ ?

పురు: ట్రైన్ లేటుకాదు, పాకెట్ లోటు. టికెట్కి పావలా తక్కువయితే దిగువ స్టేషన్లోనే దిగి నడిచివొచ్చాను.

విమల: మరి ?

పురు: మరి గిరి లేదమ్మా! కొండంత ఆశ పెట్టుకుని వెళతాం. గోళ్లు గిల్లుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ తిరిగొస్తాం. అంతే!

విమల: నాలుగు నెలలనించి జీతాలు ఇవ్వకపోతే పంతుళ్ళు మట్టి తిని బ్రతుకుతారా ?

పురు: అదాలోచించే నాధుడెవడు ? పంతుళ్ళంటే దర్వాన్ మొదలు దర్బార్ దాకా లోకువే నమ్మా !

విమల: అవును మరి ! వారంతా పట్నాల్లో కూచున్నారాయె !

పురు: నిన్న ఉదయం నించి పడిగాపులు పడివుంటే, చావు కబురు చల్లగా చెప్పారన్నట్టుగా 'రేపటి టపాలోవస్తుంది పదండి' అన్నారు.

విమల: ఇవాళ టపాలో డబ్బు వస్తుందన్నమాట. పోనీలెండి మన బాధలు విరగడవుతాయి.

పురు: (వెల వెల నవ్వి) పంతుళ్ళ బాధలు విరగడవడం కలలో మాట, చూడమ్మా! (గొంతుమార్చి) పంతుళ్ళం దేశానికి వెన్నెముకలం – ఇదీ నిన్న ఆ మహారాజు చెబుతున్న ఉపన్యాసం !

విమల: ఎవరాయన ?

పురు: ఇంకెవరు ? బోర్డు ప్రెసిడెంటు ! ఆయనకేదో సన్మానం చేశార్లే నిన్న తలకు మాసిన వాళ్ళెవరో ! అలాంటి వాడిని పిలిచి పూలమాల వేస్తేసరి మొదలు పెడతారు ధర్మబోధ !

విమల: ఆ ఉద్యోగమెలా చేసి ఆ మాత్రం నేర్చుకోకుండా ఉంటారా !

పురు: పక్కా అరగంట మాటాడాడు. ఏం మాటాడాడో తనకే అర్థమయి వుండదు. 'అహా పంతుళ్ళు దేశానికి వెన్నెముకట్టా, ఓహో పంతుళ్ళూ జాతికి మూల స్తంభాలూ' ఇదీ వరస ! ఆంజనేయ దండకం చదివినట్టు చదివాడు.

విమల: నిజానికి ప్రెసిడెంటు దృష్టిలో పంతుళ్ళంటే —

పురు: తోటకూరలో పురుగుల్తో సమానం.

విమల: పోనీండి...... గోపీ వచ్చి వెళ్లాడు. పాపకు పది రోజులనించి జ్వరం వొస్తూంటే నాతో మాట మాత్ర మన్నా చెప్పలేదేమండీ ?

పురు: విమలమ్మా ! ఈ రోగాలూ, రొష్టులూ ఒకనాటివైతే నీకు చెప్పినా అందం చందం. ఆరుగురు పిల్లలు. అడి వంత సంసారం. ఉప్పంటే చింతపండుండదు. పాలు చాలక పసిపిల్ల ఏడుపు. ఎదిగే వయస్సులో కడుపునిండా తిండిలేక గోపి ఎండిపోతున్నాడు. నీ కడుపు చల్లగా...

కన్న కూతురులాగా ఆదుకొంటున్నావు. ఈమాత్రమైనా నా సంసారం వెలుగు ముఖం చూస్తోంది.

విమల: అలా అనకండి. నాకు మాత్రం? తండ్రిలాంటి వారు మీరు. నా అన్నవారు ఇంకెవరున్నారు కనక? కష్టాల్లో మనమంతా ఒకే స్థితిలో వాళ్ళం... ఒకసారి ఇంటికి వెళ్ళి పాపని చూసిరండి. గోపీ వచ్చినప్పుడు డాక్టర్‌గారిని పిలుచుకు రమ్మని చెప్పాను.

పురు: ఉత్తచేతుల్తో వెళ్ళి ఏం లాభం? టపా వొచ్చాక చూసుకుని ఒకసారే వెళతాను.

విమల: అలాగే. (లోపలికి వెళిపోతుంది)

పురు: పాఠం తీయండి. ఒరేయ్ రామూ! లేచి పాఠం చదువు.

రాము: (నించుని) కొత్తపాఠం చదవనాండీ?

పురు: ఊఁ

రాము: (చదువుతూ) స్త్రీ బుద్ధిః ప్రళయాంతకమ్మను నార్యోక్తి యొంకు గలదు. ఆర్యావర్త దేశమున మున్నొక్కప్పుడు...

శంభు: అంటే ఏమిటండీ?

పురు: స్త్రీ బుద్ధిః ప్రళయాంతకం అనేది సంస్కృతంమాట. మీరు సంస్కృతం కూడా నేర్చుకోవలసి ఉంటుంది.

శంభు: అంటే మంత్రాలాండీ?

పురు: ఆఁ... అంతే... ఇక అర్థం వినండి. స్త్రీ బుద్ధి = ఆడ దాని బుద్ధి ప్రళయాంతక మవుతుందని అర్థం.

శంభు: తెలియడం లేదండీ.

పురు: ఆడదాని మాటవింటే మొత్తం నాశన మవుతుందని ఆ మాటకు తాత్పర్యం. యొంః = ఒక, ఆర్యోక్తి = పెద్దలు చెప్పినమాట.

రాము: ఆడదంటే పెద్దవాళ్ళా, చిన్నవాళ్ళాండీ ?

పురు: ఆడపుటక పుట్టినవాళ్ళంతా అని అర్థం.

శంభు: మరండీ మా చెల్లాయి వుంది ఆడది. మా అమ్మ వుంది ఆడది. ఈ పెద్దెమాటా వినకూడదాండీ ?

రాము: మన విమలమ్మ పంతులమ్మగారుకూడా ఆడవారే కదండీ ? ఆమె మాటలు మీరు వింటారే ?

పురు: (వాళ్ళ మాటలకు లోలో సంతోషించి) ఈ దిక్కుమాలిన చదువులు చెబితేనే మాకు జీతాలు, చదివితేనే మీకు మార్కులు. అమ్మని నమ్మొద్దు, అక్కని నమ్మొద్దు ఈ రాతలు మార్చే నీతిమంతులు లేరమ్మా. ఏం చేద్దాం ? ఇలా అఘోరిస్తోంది దేశం. ఇవన్నీ ఆర్యోక్తులు. ఆర్యావర్త దేశం కథలు మరి ! (డ్రాయరుమీది పుస్తకం తీసి చూస్తూంటే కాగితం మడత జారిపడుతుంది) ఏమిటీ కాగితం (తీసి చదువుతూ) మహారాజశ్రీ విమలమ్మ గారికి, రాత్రికి నువ్వు ... ...

రాము: అదండీ ...

శంభు: పాపారావు మామయ్య పెట్టాడండీ !

రాము: వాళ్ళబ్బాయిని కేపు—

శంభు: బళ్ళోకి పంపిస్తాడటండీ

పురు: మాటాడకుండా చదువుకోండిరా ! (కాగితం జేబులో కుక్కుతాడు. విషాదం కమ్ముతుంది.) విమలమ్మా, విమలమ్మా !

('ఆఁ వొస్తున్నానండీ !' అని విమల ప్రవేశిస్తుంది.)

పురు: (గుడివేపుకి నడిచి) ఇక్కడికెవరనా వొచ్చారమ్మా ?

విమల: ఎవరూ రాలే... ఆఁ... పాపారావు వొచ్చాడు.

పురు: ఎందుకొచ్చాడో ?

విమల: ఏం లేదూ... (సంశయిస్తుంది)

పురు: చెప్పమ్మా... నాతో చెప్పడానికేం ?

విమల: నిన్న అతనిదగ్గర రెండు రూపాయలు తీసుకొన్నాను.

పురు: రూపాయలా ?

విమల: నిన్న మీరు ఊరికి వెళ్ళడానికి తెచ్చాను...

పురు: అతన్నడిగి ఎందుకు తెచ్చావమ్మా ? పోనీ, ప్రయాణం లేకుండా మానేసేవాణ్ణి కదా!

విమల: వాటికోసం వొచ్చాడేమో ననుకొన్నాను. కాదట. వాళ్ళబ్బాయిని బళ్ళోకి పంపిస్తాట్ట. కనుక్కోడానికి వొచ్చానన్నాడు.

పురు: (మథనపడుతూ) విమలమ్మా ! కాలమాన పరిస్థితి బావుండలేదమ్మా ! ఆడవాళ్లు వొంటరిగా బ్రతకడం చాల కష్టం. ఎంతెంతో జాగ్రత్త, ఆత్మస్థయిర్యం ఉండాలి. అందులోనూ ఈ రోజుల్లో 'నమ్మడం' అంత పొరబాటు వేరే లేదనిపిస్తుంది.

విమల: (ఆయన మాటలు అర్థంకాక, తన పరిస్థితి గుర్తుకు వచ్చి ఆందోళన చెందుతుంది.) నిజమేనండీ.

పురు: ఔనా మరి. కన్న కూతురువంటిదానివి గనక చెబుతున్నాను. నా కోసమైనా నీ కోసమైనా అయినచోట కానిచోట అప్పులు చెయ్యకమ్మా. మనకుండే కష్టాలు మనకుండనే ఉన్నాయి. వీటికితోడు అపనిందలుకూడా మన పాలిటబడితే ఇంకేంకావాలి.

విమల: మరేన్నడూ తీసుకోను నాయనగారూ !

పురు: పంతులమ్మలంటే ఎంత తేలిగ్గా చూస్తారో మనం ఎన్నో విషయాలు చూస్తున్నాం. వింటున్నాం. ఆ మధ్య అందంగా ఉన్న దోషానికే కాదూ సుబ్బులక్ష్మిని ఏంచేశారు ? అర్ధరాత్రివేళ నిద్రపోతూంటే మంచం పాటినే ఎత్తుకుపోయి జుట్టు కాస్తా కత్తిరించేశారు. అందుకేమన్నా కారణం వేరే ఉందా? ఊహూ : అది మంచిపని కాదన్నవాడున్నాడా? ఎవరికి చెప్పుకొన్నా ఆలించేవాడు లేక, ఉద్యోగం వదిలేసి ఉసూరుమంటూ వెళ్ళిపోయింది. ఆ ఊళ్ళో పంతుళ్ళు మాత్రం ఏం చెయ్యగలరు? చెప్పుకొంటే ప్రాణహాని, చెప్పుకోకపోతే మానహాని !

విమల: (మొఖాన్ని చేతుల్లో దాచుకొని కుములుతుంది.)

పురు: ఏం దోషం లేకపోయినప్పుడే అన్ని అగచాట్లు. ఇక పొరబాటునో గ్రహపాటునో కాలు జారితే... కాలు బట్టిన మొసలినన్నా విడిపించుకోవచ్చు కాని, మగవాణ్ణి వదిలించుకోవడం మాత్రం చాన్న తర్వాతనే ! అమ్మా!

ఈ జీవితంలో ఎన్నో కష్టాలనుభవించాను. గతీ మతీ కోల్పోయిన వాళ్ళని ఎందరినో చూశాను. వాళ్లతో పాటే కష్టాలు పంచుకున్నాను. ఆ అనుభవంతోనే చెబుతున్నాను. నీవా వొంటరిదానివి. ఈ ఉద్యోగమా నీకు తాత్కాలికం. ఇప్పటికే జీవితంలో నువ్వు చాలా దుఃఖాల్ని అనుభవించావ్. ఇప్పుడిప్పుడే కాస్త నిల దొక్కుకుంటున్నావ్ ... ఒక్కమాట చెప్పనా, విమ లమ్మా ?

విమల: చెప్పండి ...

పురు: వయసు మీరిందని దిగులు పడొద్దు. అనువూ అవ కాశం వొస్తే పెళ్ళిచేసుకోమ్మా !

విమల: పెళ్లా ?...

(బయటినుంచి 'పంతులుగారూ ! పంతులుగారూ !' అని పిలుపులు)

పురు: విమలమ్మా ! నువ్వు వెళ్ళు. (మున్సబ్ ప్రవేశం) మున్సబ్ గారా ? దయచేయండి. రండి ...

మున్సబ్: పంతులూ, పిల్లా జెల్లా బావున్నారా ?

పురు: మామూలే నండి.

మున్స: పంతులూ చూడు ! ఊళ్ళో ఎలెక్షన్లు. మన పార్టీకి నూటికి 99 పాళ్ళు అఖండ విజయం. బోర్డు మన చేతికి వచ్చిన మర్నాడు చూడు. ఆ కరణంగాణ్ణి కాలరాచి నలిపివేస్తాను. ఏ మంటావ్ చెప్పు !

పురు: ఇందులో అనడానికి ఏముంది లెండి.

మున్స: అన్నట్టు పంతులూ! ఈ రెండు రోజులూ నువ్వు నీ వార్డులో పని చెయ్యాలి. మరీ ముఖ్యం ఏమంటే - ఆ కరణం డబ్బులు రాలుస్తాడేమో కనిపెట్టి ఉండాలి.

పురు: క్షమించండి. పిల్లలు, స్కూళ్లు ఈ గొడవలు తప్ప నాకి ఎలక్షన్లు పాడూ తెలివండి. అలాంటివేమీ నాకు చెప్ప కండి.

మున్స: పంతులూ... ఏఁవిటా నీరసం మాటలు! ఝుమా యించి పనిచేసి పార్టీని గెలిపించాలి కాని, అబ్బెబ్బె...

పురు: దయచేసి నాకీ గొడవలు పెట్టకండి. పదేళ్ళనించీ మీ వూళ్లో ఉంటున్నాను. ఏ నాడన్నా ఎలక్షన్లలో, పార్టీల్లో పాల్గొనడం చూశారా?

మున్స: అదేకదూ పంతులూ, అసలు కిటుకు! ఏ గొడవా లేని వాళ్ళే మన పక్షాన నిలబడాలి. అప్పుడు చూడు ఆ కరణంగాడి పని. జకాయి బుకాయిని పోగుచేసుకో వడం అనుకున్నాడు కాబోలు. మన తరఫున ఎలాంటి బుద్ధి మంతులున్నారో వాడు చూసి బుద్ధి తెచ్చుకోవాలి. ఇంతేందుకు బోర్డు మన చేతికొచ్చిన మర్నాడు చూడ వయ్యా వాడి పాట్లు... నీ సంగతేమిటి తేల్చు. రాత్రికి నలుగురితో పాటు బయల్దేరి నువ్వుకూడా ఇంటింటికి తిరగాలి. మొగమోటం పడకు. ఐదో పదో ఖర్చులకు ఉంచుకో. పాపం! నీకు మాత్రం పిల్లాజెల్లా గంపెడంత మందాయె!

('పంతులుగారూ, పంతులుగారూ' అని బయటినించి పిలుపులు)

పురు: ఎవరు నాయనా?

మున్స: తెలీడంలా? వెట్టోడి గొంతు. కరణం పంపించి వుంటాడు. గవర్నమెంట్ వెట్టోళ్ళను పెట్టింది కబుర్లు చేరెయ్యడానికేనా? రేపే అర్జీ తగిలించి డొక్క చించేస్తాను వాణ్ణీ వీణ్ణీకూడా. నేలపాడు మున్సబ్ అంటే ఏఁవిటో ఒకసారి తడాఖా చూపించి వదుల్తాను.

("పంతులుగారూ! మీరు ఉన్నారో లేరో చూడమని కరణంగారు పంపించారండి" అని వినిపిస్తుంది.)

మున్స: పరువు తీస్తున్నావయ్యా పంతులూ! ఆఖరిమాట చెప్పు. కరణం ఎంతిస్తానన్నాడేఁవిటి?

పురు: తమరలా ఊహించకండి. నేనూ ఆయనా ఇంతవరకు కలుసుకోనే లేదు.

మున్స: సరే. నువ్వు నా పార్టీ వాడివేనని ఊరంతా చెప్పేశాను. ఆ కరణం నీతో బేరం పెట్టడానికి వొస్తున్నాడిప్పుడు. అంతే! అమ్మమ్మా వాడెత్తులు నాకు తెలుసు! ఇదుగో నువ్వు మెత్తబడ్డావా? తర్వాత ఏమనుకున్నా లాభం లేదు. బోర్డు ప్రెసిడెంటు మా వాడన్న విషయం బాగా ముమ్మాటికీ జ్ఞాపకం పెట్టుకోసుమా! వెళుతున్నా మరి...

పురు: వెళ్ళిరండి.

మున్స: (వెళుతూ వెనక్కి తిరిగివచ్చి) ఆఖరిమాట, ఇదుగో పంతులూ! నీకూ నీ తరఫున వోటర్లకూ కరణం ముట్ట

చెప్పేదానికంటే పదో పరకో నే నే హెచ్చు ఇస్తాను. నువ్వు ఊం అను.

పురు: మీరు వెళ్ళిరండి.

మున్న: (మళ్ళా పోతూ వెనక్కి తిరిగి) మర్చిపోకు. తెలిసింది కదూ మెత్తపడకు! కరణంగారి పేగులు తీయకపోతే ఈ నేలపాడు మున్నబ్ బ్రతికేం? చచ్చేం?

(వెళిపోతాడు)

పురు: (తల పట్టుకూర్చుంటూ) అమ్మయ్యా, ఉశ్ ... ...

(కరణం ప్రవేశిస్తాడు. సౌమ్యుడు. 'ఒక్కమాట' అనడం ఆయన అలవాటు.)

కరణం: పంతులూ, నమస్కారం.

పురు: కరణంగారా? నమస్కారం! రండి.

కరణం: నాకు తీరిక లేదు. వెళ్ళాలి. ఒక్కమాట. ఈ ఊరిని, నేలపాడుని గాడిదలు ఏలడమా? లేక నావంటి బుద్ధిమంతులకింద చల్లగా ఉండడమా అన్నదే పెద్ద సమస్య! ఒక్కమాట. డొక్కశుద్ధి ఉన్నవాడివి. నలుగురికీ మంచీ చెడ్డా చెప్పగలిగిన వాడివి. ఒక్కమాట. నిన్ను నేను నిర్బంధంగా అడగ తలుచుకోలేదు. నువ్వు గాడిదలపార్టీకి మద్దత్తు చేస్తున్నావని సదరు మనుషుల ద్వారా నమ్మకంగా తెలిసింది. ఈ విషయంలో నువ్వు చెప్పదలుచుకుంది నేను విన దలుచుకోలేదు. ఊళ్లో పార్టీల గొడవ నీ కొద్దు. నీ గొడవ ఊరికీ వొద్దు. ఒక్కమాట. నువ్వు మరో ఇరవై ఏళ్లు ఈ ఊళ్ళోనే వున్నా పొరుగూరి

వాడివే కాని నేలపాడు నివాసివి కాలేవు. భారతం చదివాను. రామాయణం పారాయణం చేశాను. నీ దయవల్ల ఈ ఊరి కరిణీకం నే నే చేస్తున్నాను. ఈ ఊరు గాడిదల పార్టీ చేతిలో బడి నాశనమై పోతూంటే చూస్తూ ఊరుకుంటానా ? ఒక్కమాట. రావణాసురుడి చేతిలో స్వర్ణ నగరం లంక నాశనమై పోయింది. దుర్యోధనుడి చేతిలో హస్తినాపురం భస్మీపటలం అయిపోయింది. అలాగే నేలపాడు గాడిదల చేతిలో... ఒక్కమాట. అలనాడు కృష్ణుడే పూనుకొన్నాడు. భారతం పూర్తి అయింది. ఆంజనేయుడు పనిచేశాడు. రామాయణం తేలింది. నేను, ఒక్కమాట, పంతులూ! స్వయంగా నడుం కట్టాను.

(గోపీ కంగారుగా వస్తాడు.)

గోపీ: నాన్నా ! పాపకు జబ్బు ఎక్కువగా ఉంది.

కరణం: పంతులూ ఒక్కమాట. డాక్టర్‌కి చూపించలేదూ ?

గోపి: చూపించామండి.

పురు: పద నాయనా ! వస్తాను, పాప చూసి.

(గోపి వెళిపోతాడు.)

కరణం: సరే, నాకు తీరిక లేదు. నీకూ పనిఉంది. మరైతే పోతాను. ఒక్కమాట. బోర్డు ప్రెసిడెంట్ వాళ్ళవాడే కావచ్చు. పర్సనల్ అసిస్టెంట్ మనవాడు. నందంటే నంది అంటాడు... ఎంత చెబితే అంత. ఆలోచించు. గాడి

దలపార్టీ నశించిననాడే ఈ ఊరికి ముక్తి. ప్రజలకెంత భుక్తి. పరమేశ్వరుడికి రక్తి. ఒక్కమాట. వెళతాను...
(నిష్క్రమిస్తాడు.)

పురు: విమలమ్మా ! విమలమ్మా !... ...

(విమల వొస్తుంది. కళ్ళెర్రబడి ఉంటాయి.)

పురు: (గతుక్కుమని) ఏమ్మా ! ఎందుకలా కళ్ళెర్రబడ్డాయి? కన్నీళ్ళు పెట్టావా ? పిచ్చితల్లీ ! చూడు ! మనకు వచ్చేవి కష్టాలు. ఎమన్నా అన్నా, విన్నా నేనే కదమ్మా ! పిల్లలకు చదువు చెబుదామంటే అర్థం పర్థం లేని పాఠాలు. తలాతోకాలేని చదువులు. ఇక మనకు జీతాలందవు. ఇంటో రోగాలు. ఊళ్ళో ఎలక్షన్లట. చూస్తున్నావ్‌గా మున్సబ్ ధాం ధూంలు. కరణం బెదరింపులు. ఊరికి కాస్త మంచి చేద్దాం, పాడుబడిన స్కూలుని బాగు చేద్దాం అనే ఆలోచన లేదు. వోట్లు కావాలి. పార్టీలు గెలవాలి. పెత్తనం రావాలి. తము బాగుపడాలి. ఇదే ఆలోచన. ఏం చస్తాం? ముందు నుయ్యి. వెనక గొయ్యి. పుండుమీద పుల్లన్నట్టు కొత్త బెడదలు (విమలవేపు చూసి) ఏవిటమ్మా అలా ఉన్నావ్ ? నా మాటలు కష్టం కలిగించాయా ?

విమల: లేదు నాయనగారూ ! నా మనసు...

పురు: చెప్పమ్మా !... పాపారావు గురించా ?

విమల: (ఆశ్చర్యం) ఏఁవిటి ?

పురు: వాడి బ్రతుకంతేలే. ఇలానే రాస్తుంటాను ఉత్తరాలు. ఇదివరకు అక్కడక్కడా చీపురుదెబ్బలు తిన్నా సిగ్గు రాలేదు వాడికి. అంతమాత్రానికే బెంగ బడకమ్మా! తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళనుకునే అమాయకు రాలివి నువ్వు.

విమల: ఉత్తరాలేఁవిటి నాయనగారూ!

పురు: వాడి మొఖాం. నీ కోసం ఓ చీటి రాసి ఏడ్చాను లే; పనికి మాలినవాడు ... (చీటీ చించివేస్తూ) పీడ వదిలి పోయిందిలే...

(బంట్రోతు ప్రవేశం)

బంట్రోతు: ఇనస్పెక్టరుగారు వస్తున్నారు, అయ్యగారూ!

పురు: ఇనస్పెక్టరుగారా! ఇప్పుడేనా?

బంట్రో: దోవలో మాటాడుతున్నారు. ఈయన అసలే పెళసరి మనిషి. ఉత్తచేతుల్తో సాగనంపకండయ్యగారూ!

పురు: కరువులో అధికమాసం! ఎక్కణ్ణించి తెమ్మంటావు?

విమల: ముసుపు లెక్కణ్ణించి వొస్తాయి?

బంట్రో: అంతే సరిపోయిందా అమ్మా! రావడం పోవడం మాటలా? అయ్యగారూ! మీ ఊళ్ళో మంచి వెన్న దొరుకుతుందని ఆయనకు తెలిసిందండయ్యా.

పురు: ఏ పల్లెటూళ్ళో అయినా వెన్న దొరుకుతుంది.

బంట్రో: దొరకొ్కండి. అలవాటు బట్టి అడగబుద్దేస్తుందిగాని, తమకు తెలీని సంగతేముంటుందండి? అన్నట్టు మా అమ్మగారు – ఇనస్పెక్టరు భార్యగారు ఓ అర్ధమణుగు

చింతకాయలు పట్టించుకు రమ్మన్నారండీ. నేలపాడు విజటంటే – మరీ మరీ చెప్పారండీ.

పురు: చింతకాయలు కొనిపెట్టే తాహతే వుంటే కుర్రాడికి తిండీ, కూతురికి ఇంజెక్షన్ చూద్దును మరి !

బంట్రో: మరి ఆనక చెప్పలేదనేరు. నా విషయం సగం సగం చూసి తోలేసెయకండి. అన్నీ ఆయనకే చెల్లగట్టి నాపని మాడ్చకండి. మీ పుణ్యం ఉంటుంది !

పురు: (నిట్టూర్చి, ఉక్కిరిబిక్కిరై.) చూడు నాయనా ! నువ్వూ కష్టసుఖా లెరిగినవాడివి. పిల్లాజెల్లా ఉన్నవాడివి. నిజం చెబుతున్నాను. చేతిలో ఎర్రని ఏగాని లేదు. నిన్న జీతాలకోసమని ఎలాగో తిప్పలుబడి రెండు రూపాయలు చేతబట్టి వెళ్ళాను. కాళ్ళు గొట్టుకొంటూ వొచ్చాను. ఇవాళిటపాలో వొస్తాయి పొమ్మన్నారు వాళ్ళు. నాలుగు నెలలనించి జీతాలు లేవాయె ! ఊరంతా అప్పులు ! వొళ్ళంతా నెప్పులు !

బంట్రో: పోనీండయ్యా ఏం చేస్తాం! అందరు కలిసి అధికార్లని ఉద్ధరించే వాళ్ళేకాని, బక్కా- బడుగుని కనిపెట్టి వుండే వాళ్ళే కనిపించరయ్యె. కాగితం ముక్క- కావలసినా ఉరుకులు పరుగులు పెట్టేది మేం. ఏముందండయ్యా ! మన కెందుకులే అని మేం కాస్త కళ్ళుమూస్తే ఏం జరుగుతుంది ? పోన్లెండి. నా అదృష్టం. మీకు భగ వంతుడు బుద్ధి పుట్టించలేదు. నాకు ప్రాప్తం లేదను కుంటాను – కాని, చూడండయ్యా ! ఆ వెన్న సంగతి,

చింతకాయల సంగతి తప్పదు ! అవి తెప్పించి ఉంచితే, సంతకం గీకేసి వెళిపోతాం. ఎలాగూ తిండీ తిప్పలు మీారు చూసే పనిలేదు కదా ! మరి, ఏమంటారు ?

పురు: ఏం లాభం లేదు నాయనా !

బంట్రో: అంతేనా !

విమల: అంతే !

బంట్రో: మీా ఇష్టమండయ్యగారూ ! (వెళిపోతాడు)

విమల: ఎలా ఇప్పుడు ?

పురు: ఎలాగేముంది ? వెనకో పద్యం ఉంది. నువ్వు వినే ఉంటావు. 'గురువుల రాక దాసిమృతి' పద్యం విన లేదూ ? గురువులవారు మందీ మార్బలాన్ని వెంటేసుకుని వస్తున్నామని కబురు పంపారట ; పని చేసే దాసి చచ్చి పోయింది. పైన వాన. ఎప్పుడో చేబదులు పుచ్చుకొన డబ్బుకోసంపోరుగువాడు లడాయికి తయారయ్యాడు. చెవిలో పోటు. ఇలా ఒకటేమిటి ఓ డజను కష్టాలు వొచ్చాయి మహాప్రభో ఏం చెయ్యను ? అన్నాట్ట మన లాంటి వాడెవడో.

విమల: గుండెలు నలిగే కష్టాల్లో కూడా మీారు నిబ్బరంగా ఉంటారు.

పురు: ఆ కాస్తా లేకపోతే ఏ నాడో ఆత్మహత్య చేసుకోవడం జరిగేది. నిబ్బరం పుటకతోనే రాదమ్మా ! కష్టాలు నెత్తిమీాద తంతుంటే నిబ్బరం దానంతటి కదే అబ్బుతుంది... ఈ టపా తొందరగా వొచ్చినా బావుండును.

విమల: పోనీ ఒకసారి వెళ్ళి పాపాయిని చూసిరండీ.

పురు: ఎలాగమ్మా! ఇన్‌స్పెక్టరు వొస్తుంటేనూ... అసలేపాడు పాడుగా ఉన్నాయి పరిస్థితులు. పద, సర్దవలసినవి ఏవన్నా ఉన్నాయేమో చూడు!

(స్కూళ్ళ ఇనస్పెక్టర్ ముందూ, ఆ వెనక బంట్రోతు ప్రవేశిస్తారు. ఇనస్పెక్టర్ ముఖం ఘుమఘుమ లాడుతుంటుంది.)

విమల, పురు: నమస్కారమండీ.

ఇన: (గమనించకుండా) ఏంస్కూలు! ఏంస్కూలు! సరస్వతీ దేవి ఇక్కడే మకాం పెట్టినట్టుంది. (కిందాపైనా చూసి) గొడ్లపాకలు నయం పంతులుగారూ! మన రేంజిలో ఇలా పాకలూ గుడిసెలూ లాభం లేదండీ!

పురు: చిత్తం. పల్లెటూళ్ళో వెసులుబాటు తక్కువ. పాకలు తప్ప మేడలెక్కడ దొరుకుతాయండీ?

ఇన: జవాబులు చేతకావని నేననుకోవడం లేదు. అదీగాక మీ నడవడికలన్నీ వినేవస్తున్నాను.

పురు: సరి: చాల మంచిది. వినడంవల్ల మంచేగాని చేడేమీ ఉండదు లెండి.

ఇన: మీ కున్న ధీమా నిజంగా ప్రశంసింప తగిందే అనుకోండి. (విమలను తేరిపార చూస్తూ) అసలీవ్యూహం కాదను కొంటాను.

విమ: కాదు, మూలపాడు.

ఇన: నేలపాడు, మూలపాడు బావుంది. మీరు మీ క్లాసులో ఉండండి.

(విమల చరచర చూసి వెళిపోతుంది.)

ఇన: పురుషోత్తం పంతులుగారూ ! ఏఁవిటలా ఉన్నారు ?
పురు: ఏమీ లేదండీ.
ఇన: గవర్నమెంట్ కోట్లు ఖర్చుచేసి విద్యాశాఖ నడిపిస్తోంది. కాని, నిద్రపోతుంటారు. ప్రభుత్వం సొమ్ము గంగపాలు !
పురు: అదే నిజమైతే, ఒక్క పంతుళ్ళేఁవిటి లెండి ! చాల మంది బాధ్యత వహించవలసి వొస్తుంది.
ఇన: ఎవరిబాధ్యత వారు చూసుకుంటే ఎందుకైనా మంచిది. సరే, పోనీయండి. పంతులుగారూ !
పురు: అఁ.
ఇన: ఏఁవిటి మా బంట్రోతుమీద విసుక్కొన్నారంట, కసురుకొన్నారంట !
పురు: నేనా ? (బంట్రోతు వేపు చూసి) ఏఁవోయ్...
ఇన: వాడి మొహం లెండి ! మీరు ఏదో అనివుంటే – అలా అర్థంచేసుకుని ఉంటాడు లెండి. ఏఁవడిగినా 'ఉఁహు లాభం లేదు' అని తల తిప్పేశారట !
పురు: ఆ మాటైతే నిజమేలెండి.
ఇన: మరే దబద్ధం ?
పురు: విసుక్కుని కసురుకున్న మాట.
ఇన: లాభంలేదని అన్నమాట నిజమే నన్నమాట ? (పుస్తకాలు తిరగేస్తుంటాడు) చెప్పండి.

పురు: అన్నమాట నిజమేనండి. అబద్ధం చెప్పను. పరిస్థితులు అలాంటివి మరి !

ఇన: (అణచుకుని) అలాగా ... పరిస్థితులే కారణమా ? లేక ...

పురు: లేక ...

ఇన: ఆదర్శాలేమన్నా వొంటబట్టాయేమోనని.

పురు: పట్టినా పట్టక పోయినా ఎవరి ఆదర్శాలు వారికి ఉంటాయి కదండి. నా విధ్యుక్త ధర్మాన్ని నేను ఆత్మ వంచన చేసుకోకుండా నెరవేరుస్తున్నాను. కృషి చేస్తాను. అంతేకాని ఈ ముడుపులు ముట్టింపులు నాకు తెలీవు.

ఇన: అంటే ... మర్యాద విషయంలో ...

పురు: మర్యాద, అమర్యాద విషయా లిప్పుడెందుకులెండి.

ఇన: (కోపాన్ని మింగుతూ) ఆ విజిట్‌బుక్ ఇలా అందుకోండి.

పురు: (పుస్తకం ఇస్తూ) మా కష్ట సుఖాల్ని గమనించే బాధ్యత కూడా ఉంటే ఎంత బావుండును !

ఇన: ఔనౌను. (పుస్తకంలో బరబరా గీకుతూ) పిల్లలు హాజరు కంటే గైర్హాజరు హెచ్చు. ఉపాధ్యాయులకు సూ్కలు విషయమునందు దుపేక్ష, గ్రామ విషయములందపేక్ష. ఉపాధ్యాయులకు ఉండదగిన వినయ విధేయతలు సంశ యింపదగినట్లున్నవి. గ్రామపెద్దల అభిప్రాయములు తీవ్ర ముగా గమనించిన యెడల నేలపాడు ఉపాధ్యాయులు తమ ప్రవర్తనలు మేరమీరినట్లు దాఖలాలు కనుపించు చున్నవి. అదియునుంగాక గ్రామ విషయములలో వీరి ప్రత్యక్ష జోక్యములు అంత రుచికరమైనవి గా నేరవు ...

(పురుషోత్తంతో) ఇపుడు తెలిసిందా? నీ లౌక్యాలు, పల్లెటూరి తెలివితేటలు ఇనస్పెక్టర్ ఆఫ్‌స్కూల్సుతోనా? ఇటిజ్‌నాట్ ఏ జోక్ పంతులూ!

పురు: అది కొత్తగా చెప్పాలా?

ఇన: పెద్దా చిన్నా, మంచీ చెడ్డా, మర్యాదా ఉండక్కర్లేదూ? పైనుంచి వొస్తే ఆదర్శాలు వల్లిస్తూ కూచుంటావన్న మాట! ఆదర్శాలు వినడానికేనా మా రాకపోకలు? ఊళ్లో పెద్దలు నెత్తీనోరు పెట్టుకుని చెప్పారు. ఎంతో ఇదయిపోయాను. ఊళ్ళో పెద్దలతో సరసంగా ఉండక, అధికార్లకు తలవొగ్గక ఏం చేద్దామని? నోరు తెరిచి అడిగితే ముష్టి వెన్నపూస, వెధవ చింతకాయలు కూడా వీల్లేదుకదూ?

పురు: అయ్యా! తమరు పై అధికార్లు. ముష్టి వెన్నపూస, వెధవచింతకాయలు ఉత్తమాటలకు వొచ్చేవయితే ఎలాగో సాధించి ఉండేవాళ్ళం. రూపాయలు కావాలి. నాలుగు నెలలనించి జీతాలు లేవు. ఆలుబిడ్డలు అలో లక్ష్మణా అని ఏడుస్తున్నారు. ఆ కష్టం ఆలోచించే నాథుల్లేరు.

ఇన: అవునవును. ఇంతలావు కష్టపడిపోతున్న మహాపురుషుల్ని గురించి ఆలోచించే నాథులున్నారా భూప్రపంచంలో ...

పురు: (పెదవి కొరుక్కుంటూ) మీపట్ల నా మంచితనం నిరుపయోగమైపోయింది. నా మర్యాద నేలకలిసింది. మీరు మీ డ్యూటీప్రకారం ప్రవర్తించండి. అంతేకాని, అనవసర ప్రమేయాలకు దిగకండి. మీరు రాయవలసిందీ,

చేయవలసింది చేసుకోండి. అంతే! (కోపంతో చలించుతాడు)

ఇన: ఏఁవిటి చించుకొంటావ్? (లేచి, కాగితం జేబులోంచి తీసి పడేస్తూ) ఇదుగో! ఇది చదువుకో! నువ్వు సాగించే అవినీతి పనులన్నీ ఇందులో ఉన్నాయి. విధవల్ని చేర్చించెందుకో ఊరూనాడూ కోడై కూస్తోంది. దాగవు నాయనా, దాగవు!

(ఇన స్పెక్టర్ వెళిపోతాడు. పురుషోత్తం కాగితం చదువుకుంటుంటాడు. అతని ముఖం మరంత విపన్నమవుతూంటుంది.)

బంట్రో: ఆకాశరామన్న ఉత్తరం బాబూ! చెబితే విన్నారు కాదు. కనీసం మా అమ్మగారికి చింతకాయలన్నా తెప్పించి ఇవ్వలేకపోయారు. అయ్యగారిపని కాదన్నారు! అయ్యగారేమో అగ్గిలంమీద గుగ్గిలమయ్యారు.

పురు: బుగ్గయ్యార్లే, నువ్వు పద! (బంట్రోతు వెళిపోతాడు) ఈ బ్రతుకు బ్రతికే కంటే ఏ బస్తీకో చేరి రిక్షా లాగి బ్రతకడం హాయి! (పిల్లలవేపు చూసి) ఈ పూటకి వెళిపోండి. తర్వాత చూద్దాం. (కాగితం చదువుకొంటూ మరింత కంగారు పడతాడు.) విమలమ్మా! విమలమ్మా! (విమల వొచ్చింది. ఆపాదమస్తకం అదోలా పరిశీలిస్తాడు. విమల కూడా దెబ్బ తిన్నట్టవుతుంది) విమలమ్మా! భగవంతుడు ఉన్నట్టా? లేనట్టా?

(గోపి వొస్తాడు.)

గోపి: నాన్నా!

పురు: (తెప్పరిల్లి) ఏం రా ?
గోపి: అమ్మ నిన్ను చప్పున రమ్మంది నాన్నా !
పురు: అమ్మ రమ్మన్నా దేవుడు రమ్మన్నా వొచ్చి ఏం చెయ్యాను ? డబ్బులు కావాలి. అందుకే ఇక్కడున్నాను మరి ! టపా చూచుకొని వస్తాను. టపాలో డబ్బు వస్తుంది. డబ్బులేందే నేం చేద్దాం ? పద, వొస్తున్నానని చెప్పు ! ఆయువుంటే బ్రతుకుతారు...

(గోపి వెళిపోతాడు.)

విమల: పోనీ... ఒకసారి వెళ్ళి...
పురు: అక్కర్లేదమ్మా ! మళ్ళా సీతతో మాట్లాడానికి వీలు దొరుకుతుందో లేదో ! ఆకాశరామన్న పేరుతో ఇనస్పెక్టర్‌కో కాగితం వచ్చింది. ఇదుగో ఆ కాగితం.
విమల: (కాగితం చదివి ఏడుస్తుంది.)
పురు: ఏమ్మా ! అందులో రాసినమాటలు అబద్ధం కదమ్మా ?
విమల: (తటపటా యిస్తుంటుంది.)
పురు: చెప్పమ్మా ! వితంతువ్వి. నాతో చెప్పమ్మా ? ఆమాట అబద్ధమే కదా ?
విమల: (ముఖం ఎత్తిచూసి దించేసుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తుంది.)
పురు: అయితే ! నిజమన్నమాట. నిజమా ?
విమల: ('నిజమే' అన్నట్టు తలూపుతుంది.)
పురు: నిజమా ? నాలుగునెలలా?... గర్భిణివా ? విమలమ్మా ! ఈ ఖర్మకు మూలం పాపా...

విమల: (మధ్యలోనే తుంచి) కాదు.

పురు: మరి...

విమల: (మాట్లాడదు)

పురు: ఎవరో చెప్పమని నిన్ను నిర్బంధించను. పోనీ, అతన్ని పెళ్ళి...

విమల: ఇదంతా నా దురదృష్టం. ఇక, ఇంతకన్నా మీతో నే నేం చెప్పలేను క్షమించండి.

పురు: విమలమ్మా! ఇప్పుడు నా కళ్ళు తెరుచుకొన్నాయి. ఈ ఆరు నెలలనించీ నువ్వు మా కోసం ఎలాంటి త్యాగం చేశావో ఇప్పుడు దర్థమవుతోంది. ఎవరో బంధువు పంపాడని చెబుతూ, సర్దే డబ్బంతా, మా కష్టాల్ని తీర్చే డబ్బంతా... ఎక్కడిదో తెలుస్తోంది. (విమల ఏడుస్తుంది) ఇతర్ల దుఃఖాల్ని తీసెయ్యాలని నువ్వే దుఃఖాన్ని నెత్తి నెత్తుకున్నావు తల్లీ! ఏడవకు... మనకు మిగిలిందల్లా ఆ ఏడుపు మాత్రమే! స్వేచ్ఛగా చచ్చే హక్కు ఎలాగూ లేదు మనకు!

(విమల ఒక్కసారి గావురుమని ఏడ్చి విసవిస లోనికి వెళిపోతుంది.)

ఏం జీవితం! అడుగడుగునా గండక త్తెరలు! అనుభవం వొకడిది, అవస్థలు వేరొకరివి! ఆనందం ఒకరికి, అధో గతి వేరొకరికి! ఎక్కడ ఈ జీవిత నాటకానికి ఆది, అంతం? ఇక విమలమ్మ గతేమిటి? వితంతువు మాతృ మూర్తి అయితే విలవిలలాడి పోదా లోకం? ఉద్యోగం

ఉంటుందని నమ్మకం ఏమిటి? (విమల నుద్దేశించి) విమలమ్మా! విమలమ్మా!

(బయటి నించి 'పోస్ట్' అని పిలుపు)

పురు: వచ్చావా బాబూ! యస్. వో. వొచ్చిందా? రాలేదూ? అదేవిటి? కవరొక్కటేనా? (కవరు విసిరి పోస్టువాడు నిష్క్రమణ) ఎక్కడ రాసిపంపారేమో (కవరు గబగబా చించి చదివి వెలవెలా పోతాడు. నోటమాట రాక గిలగిల లాడుతాడు. కన్నీళ్ళు జారుతుంటాయి.) విమలమ్మా! (చప్పున జ్ఞాపకం వొచ్చి) దొడ్లో నుయ్యి! మరేం అఘాయిత్యం జరగలేదుకదా! విమలమ్మా! విమలమ్మా!

(పురుషోత్తం లోపలకు పరుగుతీస్తాడు. రంగస్థలం అరనిమిషం ఖాళీ. ఈ సమయంలో పాపారావు వొచ్చి అటూ ఇటూ చూసి, లోపలికి తొంగి చూసి, తల పంకిస్తూ గబగబా నడవేపునించి నిష్క్రమిస్తాడు. పురుషోత్తం విమలను రెక్క పుచ్చుకుని తీసు కొస్తాడు.)

పురు: మరే అఘాయిత్యం జరగనందుకు అదృష్టవంతులం. ఆపదలు నెత్తికెక్కినప్పుడే ధైర్యంగా నిలబడాలమ్మా! నిబ్బరం లేకపోతే నీకూ నాకూ గతిలేదు. ఇదుగో! టపా వొచ్చింది కాని డబ్బు రాలేదు. డబ్బు రాలేదు కాని, పైవారి అనుగ్రహం దక్కింది. మన్యానికి నన్ను ట్రాన్సుఫర్ చేశారు. ఈ బండెడు సంసారంతో మన్యంలో బతికి బట్ట కట్టే యోగ్యత నాకులేదు. ఇక, నీ విషయం ఉద్యోగం తీసేశారు. నీ లాగానే నన్నూ

తీసేస్తే ఎంతో హాయిగా ఉండేది. (కన్నీళ్ళు జారుతుంటాయి. కాని, నిండు గొంతుకతో) ఈ అన్యాయం, దుర్మార్గం – నా మీద కత్తికట్టి పగ సాధించడం ఎందుకో ఎవరికేం లాభమో తెలీదు. పిల్లలు, చదువు, స్కూలు గొడవతప్ప మరేమీ ఎరగని మనకు ఈ తిప్పలు తెచ్చారు. (అప్పటిదాకా ఏడుస్తున్న విమల గంభీరంగా మారిపోతుంది.) విమలమ్మా ! (చలించిపోతాడు.)

విమల: నా మనసు రాయి చేసుకొన్నాను, నాయనగారు. పదండి, మన్యంలోకైనా మహారణ్యంలోకైనా సరే ! అంట్లు తోమి అయినా బ్రతుకుతాను. మిమ్మల్ని కంటి పెట్టుకునిఉంటాను. ఈమాత్రం ఆశ్రయం మివ్వండి చాలు. ఈ ఉద్యోగం ఊడిపోయినందువల్ల నాకేం నష్టంలేదు. ఈ అనుభవించాలు, జన్మజన్మాలకు సరిపోతుంది. మీరు తండ్రిలాంటివారు. నా దురదృష్టాన్ని మీరే ఆదుకొని తొలగించగలరు. ఒకవేళ నేను మీకు బరువై ...

పురు: (తెప్పరిల్లి) తండ్రికి బిడ్డ బరువైపోతుందా ? రామ్మా, అలాగే నీ ఇష్టం ! ఈ పార్టీ గొడవలనించి, ఈ ద్వేషాలనించి, నిందలనించి, భయాలనించి దూరంగా, చాల దూరంగా వెళ్ళిపోదాం. ఎరిగిన ఊళ్ళో అమ్ముకు తిన్నా అపరాధమే ! అన్నం తిన్నా తప్పే ! తినకపోయినా తప్పులే! ఇదంతా ఒక కుట్రతో సాగించారు. అర్జీలు

పంపి సాధించారీ పెద్దలు. నోటితో నవ్వుతూనే నొసలితో వెక్కిరించారు.

విమల: అలాగే వెళదాం. (మెడలోంచి గొలుసు తీసి ఇస్తూ) ఎంతకైనా సరే అమ్మండి! మన ప్రయాణాలకు సరి పోతుంది. పాపకు ఇంజెక్షన్లు ఇప్పించండి.

(కరణం, మున్సబ్ ఇద్దరూ మూకుడుగా వొస్తారు. పురుషోత్తానికి చెరో వేపున నిలిచి రొక్కిస్తారు. మాటల్లో పోటీ పడతారు.)

కరణం: పంతులూ! ఇక నీ వంతు వచ్చింది. తేల్చు.

మున్సబ్: పంతులు! చప్పున తేల్చు ఆటో - ఇటో!

కరణం: చెప్పవలసినవన్నీ ఇదివరకే చెప్పాను.

మున్స: వినవలసినవన్నీ లోగడే విన్నావు.

కరణం: సమయం వొచ్చింది. నీళ్ళల్లో పాలు బోస్తావో, పాలల్లో నీళ్ళు పోస్తావో తేల్చు.

మున్స: అవసరానికి అక్కరపడతావో, ససేమిరా అంటావో చెప్పు.

కరణం: నీకూ నీ వోటర్లకూ ఇది అగ్ని పరీక్ష!

మున్స: ఆఁ... ఇది ఆఖరి పరీక్ష!

కరణం: న్యాయానికే నీ వోటు.

మున్స: ధర్మానికే నీ వోటు.

కరణం: భయపడుతున్నావా? పి. ఏ. మనవాడు.

మున్స: నేనుండగా - నీకేం ఫర్వాలేదు. ప్రెసిడెంట్ నావాడు.

కరణం: మనసులో ఉందేమిటో బయట పెట్టు.

మున్స: మాట తప్పనివాడవని అందరికి తెలుసు.

కరణం: దేవుడి ముఖంచూసి చెప్పు.

మున్స: గుండెమీద చెయి వేసుకొని మరీ చెప్పు.

కరణం }
మున్స } చెప్పు ! పంతులూ, చెప్పు !

పుసు: అయ్యలారా ! ఈ పాటికి వచ్చిన దోవనే దయచేయండి! మీ లాలింపులకీ బెదరింపులకీ జడవడానికి కుర్రసన్యాసిని కాను. పదండి, బాబూ పదండి. ఇంతవరకూ మీరు చేసింది చాలు ! ఇంతకన్నా నేను చెడేదేమీ లేదు. మీరు సాధించి చెయ్యగలిగిందేమీ లేదు.

కరణం: అందాకా వొచ్చిందీ ?

మున్స: రాకేం చేస్తుంది, ఇంకా ఉద్యోగం ఉందిగా... అది ఊడినప్పుడు ...

పుసు: ఆ... చేతయితే ఊడకొట్టండి. ఊరేగండి. మీకే అధి కారం ఉంటే ఉరే తీద్దురు. తొందరగా దయచెయ్యండి.

కరణం: అదీ, అసలు విషయం, తెగించి బరిమీదికి దూకుతా వన్నమాట ?

మున్స: అన్నిటికీ తెగించినట్టే దీనికీ తెగించావన్నమాట ?

కరణం: పాపారావు చెబితే ఏంవిటో అనుకొన్నాను.

మున్స: ఇంత వయస్సు వొచ్చింది. ఇంకా శృంగారం చావ లేదూ నీకు ?

(పాపారావు వొచ్చాడు)

కరణం: పాపారావూ ! నువ్వు చెప్పింది నిజమేనోయ్.

మున్న: రామ, రామ ! కలియుగం అంతా ఇక్కడే నాట్యం చేస్తోంది !

కరణం: అయినా ఆడపంతులమ్మల్ని —

మున్న: దగ్గరెట్టుకుంటే ఏమవుతుంది ?

పురు: ఏమిటీ వాగుడు ?

మున్న: పాపారావ్ ! ముసలిపంతులికి కొద్దిగా మతి చెడినట్టు కనిపిస్తోంది !

కరణం: పోనీ, మగవాడికి బుద్ధి లేకపోతే ఆడదానికి బుద్ధి ఉండక్కర్లా.

పురు: హరె హరీ ! ఏం మాటలు ?

మున్న: చేసేపనులు బాగుంటే మాటలు బావుంటాయి. ఆరుగురు బిడ్డల్ని కన్నావు. ఇంకా ...

కరణం: పంతులమ్మని ...

పురు: నోర్మూయ్యండి (వొణికిపోతాడు) పాపాత్ములు. మీ నోట్లో పురుగులు పడతవి.

మున్న: పాపారావూ !

పాపా: పోనీ మావయ్యా ! వాళ్ళ గొడవేదో వాళ్ళుపడతారు. మీ గొడవేదో మీరు చూసుకు పోరాదూ ?

విమల: (ముందుకు వచ్చి) మున్నబుగారూ ! నెలరోజుల కింది అప్పలమ్మతో కబురుచేసిన బుద్ధిమంతుడివి కదూ ? సిగ్గులేక మళ్ళీ వొచ్చారు ! కరణంగారూ ! మీరు మాత్రం ? ఉత్తరం రాయలేదూ ? నీతివంతులెప్పటినించి అయ్యారు ! ఛి ఛీ ! పరువూ మర్యాదా ఏకోశాన

ఉంది? (పాపారావు వేపు తిరిగి) నీయంత నీచుడు పుట్ట బోడు. (పురుషోత్తం చేతిలో గొలుసు తీసుకొని అందులో ముక్కతెంచి, పాపారావు మీదికి విసిరి) నీ రెండురూపాయల బదులు తీసుకో బంగారం ముక్క. ప్రేమ లేఖలు రాసి ఏడ్చావే గా! పోండి! తండ్రికీ కూతురికీ తగులాటం కల్పించే పుణ్యాత్ములు! మీ ముఖం చూపినా పాపం చుట్టుకుంటుంది!

కరణం: కలియుగం! కలియుగం!

మున్స: ఆడది తెగిస్తే చెప్పేదేముంది.

(వెళ్లి పోతారు.)

పాపా: (గొలుసుముక్క ఇవ్వబోతూ) అలా అనుకొంటే ఎలా? మనమంతా ఇరుగు పొరుగు వాళ్ళం...

విమల: ఛీ నీచుడా! నీ ముఖం చూపించకు! వెళ్ళిపో ఇక్కణ్ణించి.

(లోపలికి వెళ్లిపోతుంది. పాపారావు నిష్క్రమిస్తాడు.)

పురు: ఈ కాగితాలూ, అరణ్ణా ఇంకెందుకు? (గాలిలోకి విసిరి వేస్తాడు) అయిపోయింది. (గోడవేపు తిరిగి ప్రబోధ వాక్యాలు రాసిన అట్టలను చూసి) 'సత్యంవద' — అసత్యం వధ! ధర్మంచర! ఎందుకీ నీతి బోధలు! (తీసి దూరంగా విసిరేస్తాడు) విమలమ్మా! విమలమ్మా!

(విమల వొచ్చింది.)

పురు: అమ్మా! విమలమ్మా! ఈ నరకంనించి ఎంత తొందరలో వెళిపోతే అంత మంచిది. పారిపోదాం ఇవాళ!

విమల: అలాగేనండీ, నాయనగారూ ! ఇంటికిపోయి పాప సంగతి చూడండి ముందు.

(రామూ, శంభూ, గబగబ పరుగెత్తుకువస్తారు)

రాము: మాస్టారూ, మాస్టారూ !

పురు: ఏం నాయనా ?

శంభు: మరండీ, మీా పాపండీ...

విమల: ఏం జరిగింది శంభూ ?

రాము; చచ్చిపోయిందండీ ?

పురు: ఆఁ... (కన్నీళ్ళు జారతాయి.) అవును, మందు మాకులు లేక బలవంతంగా చనిపోయింది బిడ్డ ! (విమల పడిపోతుంది) అయిపోయింది. విమలమ్మా !... (విమలను చూసి, వొంగి గాలి విసగుతూ) అమ్మా ! విమలమ్మా (విమల కళ్ళు తెరుస్తుంది) బిడ్డ పోయినా నీవైనా మిగి లావు అదే చాలు ! పదమ్మా వెళదాం !

[ తెర ]